# అంకితము

శ్రీ

శాంతమూర్తియు - సదసద్వివేకియు

నాశ్రేయోభిలాషియు - స్వర్గవాసియు

నాబావగారును

నగు

శ్రీ రాజా కమదన వేంకటహనుమంత

జగన్నాథరావుగారి

దివ్యపాదములకు బెబ్బులినాటకము

సమర్పించి

కృతార్థుఁడ నగుచున్నాఁడను

—కోటగిరి వేంకటకృష్ణరావు,

గ్రంథకర్త.



# ఈనాటకమున వచ్చు పాత్రలు

1 రంగారావు.
బొబ్బిలి-సంస్థానాధిపతి.

2 వెంగళరావు.

3 పాపారావు.

4 చెలికాని వెంకయ్య.

5 దామెర దమ్మన్న.

6 ఇనుగంటి నరసయ్య.

7 చిన రంగారావు.

8 మంత్రి.

9 గూఢచారుఁడు.

10 వెంకన్న.

11 పెద్దన్న.

12 విజయరామరాజు.

13 హైదరుజంగుసాహేబు

14 బూసిదొర.

15 పరిచారకుఁడు.

స్త్రీలు.

16 మల్లమహా-రాజ్ఞి.

17 రామామణి-దాసి.

18 వెంకటలక్ష్మి-దాసి.



శ్రీమత్పరదేవతాయై నమః



# బొబ్బిలి

## పద్మనాయక విజయము

## ప్రథమాంకము

(శ్రీ రావు రంగారావుగారు, వెంగళరావుగారు, తాండ్రపాపయ్యగారు, ఇనుగంటి నరసయ్యగారు, చెలికాని వెంకయ్యగారు, దామెర దమ్మన్నగారు, మంత్రి, చారుఁడు ప్రవేశింతురు.)

రంగా——చారుఁడా! తరువాత?

చారు——శ్రీరావువంశనీరాకరరాకానిశాకరా! అవధరింపుము. అట్లు విజయరామరాజు సపరివారంబుగా సాటి సామంతభూపాలుర కంటె మున్ముందు హైదరు నెదుర్కొని రాణ్మహేంద్రవరపు ముకామునఁ దనకును మనకును గల వైరమెంచి బొబ్బిలిపైఁ గొండెములఁ గల్పించి వచించి సాహెబుపాదధూళి నాశ్రయించి ద్వాదశలక్షరూప్యముల——

వెంగ——సరి. ద్వాదశలక్షరూప్యముల లంచమొసంగి, కసవు మొసంగి, ద్విపాదపశువై, తుచ్ఛమ్లేచ్ఛపాదధూళి మౌళిఁ దాల్చి విజయరాముఁడు బొబ్బిలిరాజ్య మపేక్షించుచున్నాఁడు కాఁబోలు. ఈ మగరూపుఁగొనిన యాఁడుదానికి నా పుంస్త్వహీనుని సాయమా? బావా! భయకారణమే.

ఉ॥ ఏమని బైసిమాలి కుల ♦ హీననిషాదము లాశ్రయించె సం
గ్రామవిహార కేళి రిపు ♦ రాజి భరింపఁగ నిచ్చగించి, ని
ర్ధామముకాదె? క్షత్రియ తు ♦ రుష్కపరాసుదశంబు సాహసో
ద్దామ పరాక్రమక్రము సి ♦ తాంతుఁడు వెంగళరాయఁ డల్గినన్.

పాపా—యావద్వృత్తాంతము చారునినోట విననిమ్ము.

రంగా—సేవకా! అనంతరము?

చారు—అటులు లంచ మొసంగి బొబ్బిలిరాజ్యము రంగారాయమండ
లేశ్వరునుండి యెడపఱచి తన కర్పించునట్లు సాహెబుచేఁ గత్తి
యెత్తి యల్లాసాక్షిగఁ బ్రతినఁ గైకొనినాఁడు.

పాపా-ఆఁ!

తే॥ గీ॥ రావు రంగావనీశుండు ♦ బ్రతికియుండఁ
బాపరాయనికంఠానఁ ♦ బ్రాణముండ
వీర వెలమాన్యు మింత జీ ♦ వించియుండ
బొబ్బిలిన్ గెల్చుపోటరి ♦ పుట్టియున్నె.

వెంగ—సేవకా! కత్తియెత్తి యాప్రతిజ్ఞచఱచినాడు. తాటాకు చప్పు
ళ్ళకుఁ గుందేళ్ళు వడఁకవు. మంత్రాలకుఁ జింతకాయలు రాలవు.
పిల్లి శాపంబుల కుట్టితాళ్ళు తెగవు. మ్లేచ్ఛప్రతిజ్ఞలకు భరత
పుత్రులు వెఱవరు. అన్నయ్యా!

ఉ. నొంచెదఁ బూసి, హైదరు న ♦ నూనరణాంగణయుక్తవిద్య మా
యించెద సైన్యపంక్తుల, న ♦ హీనబలోద్ధతి శత్రురాజు ఖం
డించెదఁ దచ్చిరంబును గ ♦ డించెద దేవరవారికిన్ సమ
ర్పించెదఁ బద్మనాయక న ♦ పీన యశఃప్రభ నింతు దిక్కులన్.

తురుష్కుల బెదరింపులకు, క్షత్రియుల యదలింపులకు, బరా
సుల విదళింపులకు బద్మనాయకులు బెదరుదురే?

రంగా—(హైదరు నుద్దేశించి)

మ॥ అవురా! కాలమహత్త్వమెంతటిది విప ♦ ర్యాసంబు నీచాత్మకుం
డవఁడో లంచము మేపినంతనె యుద ♦ గ్రోష్ఠ్యానుసంధాన సం
భవసంరంభము వెల్లడింతువె భయో ♦ త్పాతంబు లేదిట్టి దు
ర్వ్యవసాయంబుల వెల్మవారికిఁ దృణ ♦ ప్రాయంబు లీప్రాణముల్.

నీచాధమా! విజయరామా! తురకయో మఱకయో దొరకె. నీతూరి వెలమదొరల నడఁతునని గేదెతోకసాయమున గోదావరి నీద యత్నింపకు. ఈసాహే బయ్యలఁగాదు వీరితాతలఁ జూచితిమి. ఆ పసయుఁ బైటఁబడఁగలదు. ఓరీ! క్షత్రియకులకళంకా!

సీ॥ ప్రక్కబాఁకై హారిం ♦ పదె దుర్ధరోదగ్ర
తాండ్రపాపయ్య ప్ర ♦ తాపవహ్ని
పడకఁబామై వధిం ♦ పదె దుర్నివారోగ్ర
వెంగళరాయ దో ♦ ర్వీర్యపటిమ
హృదయశల్యంబయి ♦ మద మడగింపదె
దామెర దమ్మన్న ♦ ధైర్యలక్ష్మి
గళనిబద్ధాహియై ♦ మలమల మాడ్పదే
చెలికాని వెంకయ్య ♦ యలఘుబలము
తే॥ గీ॥ నిబలంబులనెల్ల పో ♦ నీక నంత
రావు వేంకట శ్రీరంగ ♦ రాయవాళి
వైరిగర్భనిర్భేద దు ♦ ర్వారశాత
హేతిపాతంబు నిను సమ ♦ యించునోరి!

దామె—

చ॥ తన తలఁదన్నినట్టి విను ♦ తప్రతిభాన్వితులౌ నవాబులే
యని మొనఁ బద్మనాయక శ ♦ రాసల దగ్ధశరీరులై బలీ
యని మము మెచ్చియుంట యవ ♦ నాథము హైదరుజంగుమంత్రి మా
ర్గాన మన ముత్సహింపదని ♦ కొంకుజనించెను రంగరాణ్మణీ!

ధనాశాపాశబద్ధుడై యాత్మవినాశముఁగూడ నెఱుంగని హైదరుజంగునకు బుద్ధి యుద్ధ మంద గఱపవలయు మొత్తముమీాద మన బాహువుల తీఁట దీఱుదినము ప్రాప్తించినది.

చెలి—దమ్మన్నగారూ! బాహువుల తీఁటలేగాదు విజయరామునకు గూఁడ దిన మాసన్నమైనది. ప్రభూ!

ఉ॥ హైదరుజంగుసాహెబు స ♦ హాయము చేకురెనంచు వంశమ
ర్యాద నతిక్రమించియు దు ♦ రాగతుఁడైన విరోధిమస్తక
చ్ఛేదమొనర్తుఁ దొల్త వధ ♦ సేసెద హైదరు, బూసి దుర్మదో
న్మాదముమాాన్పెదన్ సెలవు ♦ మాత్రమొసంగుము నిర్వహించెదన్ •

కుక్క బలిసి గోనె మోసినట్లు హైదరు మోయరాని భారము వహించినాఁడు.

ఇను—దేవా! గ్రుడ్డి కన్ను మూసినను తెఱచినను నిష్ప్రయోజనము. హైదరుజంగు సహాయమున్నను లేకున్నను విజయరాముఁడు మనముం దెంత? సెలవొసంగిన బ్రభుకార్య నిర్వహణ ధూర్వహుఁడైన మీాబందుగుఁ డొక్కఁడ విజయకారణ సమర్థుండు. ఇనగంటి నర్సారాయ ప్రత్యర్థికంఠలుంఠనక్రియాసక్త నిశితకుఠార దర్వీకరము ఫూత్కృత హాలాహల భీకరమై విజయరాముని కొఱకె కెవ్వు డెప్పుడని పేరెములఁ బాఱుచు వారింపరాకున్నది. ఆజ్ఞయే అవశిష్టము.

పాపా—దేశముష్కర తురుష్కాధమా!

సీ॥ బ్రహ్మాచమూావతి ♦ వైరివిదారణో
ద్భాసిత కౌక్షేయ ♦ పాటవంబు
రుద్రసేనాని ని ♦ ర్నిద్ర ప్రథితచండ
భండన పాండితీ ♦ మండనంబు

బాలచంద్రుని పరి ♦ పంథిరాడ్గర్వ ప్ర
భంజనోద్దామదోః ♦ ప్రౌఢిమంబు
భేతాళనాయుని ♦ విదలితభేతాళ
విక్రమోగ్ర పరాక్ర ♦ మక్రమంబు
తే॥గీ॥ మఱచినావేమొ సారాయి ♦ మత్తుచేత
వెలమ దొరలకు సాహెబ ♦ య్యాలకుఁ గల్గు
తారతమ్యం బెఱుంగవో ♦ నోరెఱుఁగవి
ప్రతినలాడిన మామునుదు ♦ బ్రతుకఁగలవె?

రంగా—బంధుమిత్ర సామంతులారా! మీ మీ పరాక్రమాతిశయంబు లేనెఱుంగనా? అవినయంబు లాచరింపఁదగుశూరులే యగుదురు. పిమ్మటి వృత్తాంత మాకర్ణింతము. సేవకా! తెమ్మపరి,

చారు—ప్రభుచంద్రమా! హైదరిప్పుడు సొమ్ముతిన్న యభిమానముచే బొబ్బిలివారు తనను జూడరాక నిర్లక్ష్యభావముఁ జూపిరని మాటిమాటికి మనస్సైఁ గనలుచు దండతాడితమహోరగంబురీతి మండిపడుచు క్షణక్షణము విజయరామునకు బొబ్బిలిఁ గట్టిపెట్టెదనని గట్టిపట్టుఁబట్టి మిట్టిపడుచున్నాఁడు.

రంగా—రే! మ్లేచ్ఛాధమా! నిజ కౌక్షేయ విక్షేప తృణీకృత విపక్షదక్షాక్షీణ దోర్బలశాలియగు రంగారాయక్షమావల్లభునే యెఱుంగకున్నాఁడవు. ఓరీ! సజ్జనద్రోహీ!

మ॥ తరమా! కాతరవృత్తి నన్గెలువఁ బం ♦ తంబూని నావంట! పో
తరమేలా? మొగలాయి వెల్మబల భే ♦ దం బెల్లిఁ గావించు సం
గరకేళిన్ శలభంబవై పడవె! రం ♦ గారాయ భూమండ లే
శ్వరకోదండ విముక్తదివ్యశర సం ♦ జాతానలజ్వాలలన్.

పాపా—ఓరీ! హైదరా! మ్లేచ్ఛులు వెలమబిడ్డల పౌరుషంబుఁ జవిచూచి చాలా దినంబులైనది. రా రమ్ము. కాని—

శా॥ కాఱుంగూళలఁ గూయఁగావలదు నా ♦ ల్కాంజీలు శ్రీతాండవ్రపా
పారావోద్ధత విక్రమక్రమ కళా ♦ పాండిత్య వైశేష్య దు
ర్వారప్రాభవమేరికైన మఱలిం ♦ పక రాదు నీవెంత నా
బారి న్నిల్చుట సంభవించిన దృణ ♦ ప్రాయాన నిర్జింపనే?

వెంగ—అన్నయ్యా! గోళ్లం దీయుదానికి గొడ్డళ్ళు పనియుండదు. ఈ స్వల్పయుద్ధకార్యమునకు బావగారికి శ్రమయేల? తమ కాయాసమేల?

మ॥ పనిలే దెవ్వరితోడ నే నొకఁడ దు ♦ ర్వ్యాపార శ్రీరేయదు
ర్జన సంతానముఁ జక్కఁజేతు నిజధై ♦ ర్యస్థైర్యముల్ చూపి; జం
కను బృందారకు లడ్డమైన నిను తెం ♦ గశ్రాయ దోర్వీర్య వ
హ్నిని భస్మీపటలంబుగాఁ గలవు సు ♦ మ్మా శాత్రవాంణ్యాముల్.

కాన నన్ను సెలవిచ్చి పంపివేయుము. (అని సంరంభముఁ జూపుచున్నాఁడు.)

రంగా—తమ్ముఁడా! శాంతింపుము. చారుఁడా! పిమ్మట నేమి జరిగినది?

చారు—అయ్యా! మనవిచేయనైతిని. ప్రభువుగారు బూసిగారి పేరఁ దమ్ముఁడుగారి వివాహము చేరువౌటంబట్టి తమ దర్శన మిపుడు చేయఁజాలనైతిననియుఁ దమరు బొబ్బిలి పరిసరముల క్షేతెం చునప్పుడు దర్శింపఁగలననియు వ్రాసి పంపించిన యుత్తరము విజయరామరాజు దారిలో వార్తావహుని జంపి సంగ్రహించె ననికూడఁ దెలిసినది.

రంగా—దుర్మార్గుఁడు! దౌరాత్మ్యమునకు మేరలేకున్నయది. ఆయుత్తరము బూసిగారి కందియుండుననియు నటులైన హైదరు జంగునకుఁ గోపమువచ్చినను గష్టముండదనియు నిందనుక ధైర్య

ముతో నుంటివే? సభాసదులారా! వింటిరిగదా! వీఁడెప్పటి కైన మన కంటిలోని నలుసే. ఈతూరి వీని దుర్మద మడంచుటయే కర్తవ్యము.

సీ॥ వార్తావహులసిబట్టి ♦ పథమధ్యమందు ప
ధించి యుత్తరము గ్రహించినాఁడు
ద్వాదశలక్ష రూ ♦ ప్యముల లంచమొసంగి
చెన్నటి తురకలోఁ ♦ గొన్నవాఁడు
దుష్కార్య మనకుండ ♦ నిష్కారణంబుగ
సాడీలు మనపైనిఁ ♦ జాటినాఁడు
సాహెబు సాహాయ్య ♦ సంపత్తిచే మమ్ము
నుక్కడంపఁ దలంచు ♦ చున్నవాఁడు

ఆ॥ విజయరాముఁ జేసి ♦ విలయంబో వీనికి
జగమెఱుంగఁ గలదు ♦ జన్యమందుఁ
బద్మనాయకోగ్ర ♦ బాహాబలస్ఫూర్తి
కఱకు మెఱకు తురక ♦ సరకు సరణి.

క్షత్రియ పరాక్రమముఁగూడ నీతూరి యెఱుఁగవలసియున్నది.

పాపా— బావగారు! ఎఱుగుటకేమున్నది?

సీ॥ లంచ మొసఁగియో ♦ వంచక వృత్తినో
యధికారిలోఁగొను ♦ నట్టి ఘనుఁడు
నిరపరాధుల్పైని ♦ సరకారువారితోఁ
గొండెంబులం గూయు ♦ చుండు మేటి
ఏకతంబున జగ ♦ దేక వీరుఁడనంచు
మీసాలు మెలివేయు ♦ రోసకాఁడు
శాత్రవు లేతెంచి ♦ సమరం బపేక్షింపఁ
బిక్కబలముఁ జూపు ♦ పిఱికిపంద

గీ॥ హీన మనక పరమనీచ ♦ కృతిని నేని
వైభవాపేక్ష సేయు వ్య ♦ ధాభిమాని
యతిశయోక్తి లేకుండ స ♦ త్యమును దెల్పి
నాఁడను విజయరాము బం ♦ డాల మిదియ.

రంగా—చారుఁడా! ఇపుడు హైదరు దృత్యమేమై యుండును?

చారు—దేవా! యుద్ధమునకు సన్నద్ధపడుచు విజయరాముని గలసి తమకడ కేదియో ముందుగాఁ దాఖీదుఁ బంప యత్నించు చున్నాఁడు.

రంగా—సేవకా! ఇఁక నీవు వెళ్ళవచ్చును. నీగూఢచార వృత్తియం దప్రమత్తుండవై చరింపుము.

చారు—చిత్తము. (అని నిష్క్రమించు చున్నాఁడు)

రంగా—బంధుమిత్రులారా! మన కిపుడు కర్తవ్యమేమి?

మంత్రి—కర్తవ్యమింకేమున్నది? పరిఖలఁ బరిశీలించి బురుజులఁ బరీక్షించి, యాయుధాగారంబుల విమర్శించి సైన్యంబుల సిద్ధపఱచి, యప్రమత్తులమై కంటికి ఱెప్పఁ బోలె బొబ్బిలికోట రక్షింప మన యుత్తమ యోధాగ్రేసరుల నియమించి యాహార పదార్థంబు వలయునంత పదిలపఱచి నాళయంత్రాదుల శుభ్రపఱచి యుద్ధదీక్షా బద్ధకంకణులమై సన్నద్ధపడవలయును.

పాపా—ప్రభువుగారు నామనవిఁ గూడ వినవలయును.

క॥ మునుముందుఁగ నని చేతకు
మనమే సిద్ధపడుకొంటె ♦ మహానీయుడు ద
మ్మనగారు గాయబారము
చనిననొ సామంబునఁ బని ♦ చక్కఁబడ గే.

చక్కబడకున్నను మనను బ్రిజలు మెత్తురు. దాన దుర్యశంబు లేదు.

రంగా—హాహారాయా! చక్కని తెఱవాలోచించితివి. సామదాన భేదదండోపాయములు వరుసగఁ బ్రయోగింపవలయుఁ గాన రాజునకు నుందు సామమే శ్రేయము. ఇందులకు దమ్మన్నగారే సమర్థులు. ప్రభుకార్య నిర్వాహణధూర్వహా! దమ్మనామాత్యా! మీ రీ సంధికార్యం బెటులేని నెగ్గింపవలయునని ప్రార్థనము.

దామె—స్వామీ! ప్రార్థన కావలయునా! (చిఱునగవుతో)

తే॥ గీ॥ తర తరంబులనుండి యిం ♦ దనుక మేము
పొదలుచున్నాము మీ యుప్పు ♦ వులుసుఁ దినుచు
మీరు పెంచినయట్టి శ ♦ రీరమగుటఁ
గలదు తమకిందు సర్వాధి ♦ కార మధిప!

దేవా! ఈ ప్రాణంబులు భవ దధీనంబులు. ప్రభూత్తమా! స్వామికార్య నిర్వాహణాసక్త సంతోషితాంతరంగుండ నగుచున్నాఁడ ఆజ్ఞాపింపుము.

రంగా—(ఆనందాశ్రువుల రాల్చుచు గాఁగిలించుకొని) తమ బోటి ప్రభుభక్తి పరాయణావృతభారతమాతృక యదృష్ట మసదృశము. మీయట్టి విశ్వాసయోగ్య సామంతభూపాల సమావృతంబైన బొబ్బిలికి జయమే సుస్థిరము. రాజకీయ పరతంత్రజ్ఞుఁడవగు నీకు సంధి విషయంబుల వచింప నవసరమే లేదు. అయినను—విసిమెదరుగాక! మీరు వినయంబున—

ఉ॥ హైదరుఁ జేరి కూడదను దు ♦ రాగ్రహమంచు వచించి కోరినన్
ద్వాదశలక్ష రూప్యముల ♦ పైకము మేమిడకుండి యుందుమే
త్వాదృశ మంత్రిసత్తముఁడు ♦ వైరివచస్థితి నమ్మి కేటి కు
ర్యాద? శరణ్య మొందు కల ♦ దా? యిఁకఁ గంచెమె చేనుమేసినన్.

చతుర్విధోపాయంబుల సంధికై ప్రయత్నింపుఁడు. తమ్మని వివాహము కడు చేరువౌటంబట్టియే గాని మా రామికిఁ గారణము

మఱొండుగాదని వచింపుఁడు. రమ్మనినచో వివాహకార్యము వదలి యైనను దక్షిణము రాఁగలనని మనవిచేయుఁడు. ఇచటఁ గార్యసాఫల్య చిహ్నంబులు గాన్పింపవేని తరువాత బూసిదొరగారిం జేరి—

మ॥ పరరాజన్యవచః ప్రచారము ల సం ♦ భావించి మీమంత్రి హైం
దరు లంచంబు గ్రహించి మా పయి వృథా♦ దౌష్ట్యంబుఁజూపించి సం
గరరంగంబున బొబ్బిలిం జెనక సం ♦ కల్పించి యున్నాఁడు; పో
తరు శిక్షించుచు శిష్టరక్షణము క ♦ ర్తవ్యంబటఁ చూడవే ?

మఱియుఁ దదుచిత విధివిధానంబుల వర్తింపుము.

దామో—కం॥ బూసికి మృదుతరపదవి
న్యాసవచోనియతిఁ జేర్చి ♦ యావహిలక్ న్యా
యాసక్తిం గలిగించెద
మాసిక తొలఁగక రణంబు ♦ మాన్పెద దేవా!॥

నాకు సెలవా? (తెరలో)

సెలవైనచో హైదరుజంగుసాహెబుగారి వద్దనుండి వచ్చిన పరిచారకుని బ్రవేశపెట్టదను.

రంగా—ఓరీ! అవశ్యము ప్రవేశపెట్టుము. దమ్మన్నగారూ! హైదరు గారి సందేశము వినిన తరువాతనే తాము దయచేయువచ్చును.

దామో—చిత్తము. (అని కూర్చుండును)

పరి—(ప్రవేశించి) శ్రీరావువంశప్రదీపులకు నమస్కరించుచున్నాఁడను. దేవా! ఈయుత్తరంబు హైదరుజంగుసాహెబుగారు తమకందఁ జేయుమని యాజ్ఞయొసంగిరి. (ఇచ్చును.)

రంగా—మంత్రివరా! అందుగొని లేఖార్థములు చదువుము.

మంత్రి—సేవకా ! ఇటు తెమ్ము. (లేఖ నందుకొని)

మహారాజరాజశ్రీ శ్రీరాజా రంగారాయ బహద్దరువారికి హైదరుజంగు సాహెబుగారు వ్రాయించునదేమనఁగ:—

మే మీ ప్రాంతముల కరుదెంచి యున్ని దివసంబులైనను సరకారు వారి దర్శనమునకు రాని మీప్రభునిర్లక్ష్యస్వభావము చక్కఁగ బోధ పడినది. మీ రింతటినుండి మా సామంతులుకారు. సామ్రాజ్యప్రభుత్వ మింక మాకును జెల్లదు. ఇఁక ముందు మిమ్ము బొబ్బిలిప్రభువులుగా మే మంగీకరింపము. ఈక్షణము బొబ్బిలికోట విడిచి యెందేని లేచి పొండు. విజయరామరాజును దదధీశుఁగావింతుము.

రంగా—

శా॥ ఓరీ ! నైచ్యవచః ప్రపూరిత దురు ♦ ద్యోగంబు శ్రీరావు రం
గారాయోగ్ర పరాక్రమస్ఫురిత ఖ ♦ డ్గజ్వాల మాయించు, దో
స్సారప్రాభవ పద్మనాయక విశే ♦ షవ్యాప్తి గుర్తింపఁగా
నేరంజాలక నోరుజాఱితివ యే ♦ నిన్ జంచిచెండాడెదన్.

మ్లేచ్ఛాధమా ! మర్త్యదగ్ధాతిక్రాంతిమర్యాదుండవగు నీ కాసన్న కాలము సన్నిహితమైనది సుమా!

ఉ. బొబ్బిలిరాజ్యమున్ విడిచి ♦ పొండని నోటికివచ్చినట్లు త
బ్బిబ్బులుకూయు టేటి భుజ ♦ వీర్యము? నీ విటు వ్రాయఁగా జయం
బబ్బిన నొప్పుఁగాని యిపు ♦ డాజ్ఞయొసంగుట కెవ్వఁడవు నీ
యబ్బగడించినట్టిదగు ♦ నా ! యిదిచెల్లుట కెట్టులాడినన్.

వెంగ—అన్నయ్యా ! ఇంకను దమనైసర్గిక శాంతాలాపంబుల మాన రైతిరి.

శా॥ ముంతున్ బాణపరంపరన్ విజయరా ♦ మున్ దుర్గుణోద్దాము బా
ధింతున్ హైదరుజంగు బూసి పగసా ♦ధింతున్ ధనుర్విద్యఁ జూ

పింతుఁ శాత్రవవాహినీపతుల నొ ♦ ప్పింతుఁ జయశ్రీలు క
ల్పింతుఁ బొబ్బిలిరాజ్యలక్ష్మికి విజృం ♦ భింతుఁ రణాంతంబుగాఁ

పాప— ఓరోరీ! మొఅకతురకా! దుర్నివారసముదీర్ణభుజబలాటోప పాపారాయ గాంగేయ పరిరక్షితంబైన వీరబొబ్బిలిపేరెత్త సాహసించుచున్నాఁడవ్వగా!

మ॥ కనవా? క్రొవ్వెగఁదట్టి కన్నుల నెఱుం♦గక రాకయున్నావె కిం
దును మీఁదుఁ మొగలాయిమంత్రుల దురు♦ద్యోగంబు విస్పష్ట మ
య్యెను సైరింపవు పద్మనాయక భుజా ♦ హీన ప్రతాపోగ్ర సం
జనిత క్రోధదవాగ్నికీలలు తురు ♦ ష్కా! మాను దుష్కార్యముల్.

మ॥ దురహంకార వచఃప్రచార మడఁగిం ♦ తుం జండ కోదండ వి
స్ఫురితోద్భూతశరానలార్తి శలభం ♦ పుంబోల్కి భంజించి మ
త్కరవాలంబున మాతృదేశపరర ♦ క్షా దీక్ష సాధింతు నం
గరవిద్యానిపుణత్వతత్త్వ మది యిం ♦ క దేల్తు మ్లేచ్ఛాధమా!

దామె— ఔరా! ఈనీచరాజావజ్ఞత మ్లేచ్ఛదార్ఢ్యసహాయంబునఁ జేయు నస్మద్దేశద్రోహము మేరమీఱుచున్నదే.

తే॥ గీ॥ తనకు మనకున్న శత్రుత్వ ♦ మును దలంచి
విజయరాముండు వచ్చి బొ ♦ బ్బిలి జయింప
నగునుగాని విదేశీయు ♦ నాశ్రయించి
మాతృదేశవిద్రోహంబు ♦ మగతనంబె.

చెలి—ఓరోరీ! యవనాధమా! నీకు విజయరాముని వాగ్విషము చక్కఁగఁ దలకెక్కినది.

శా॥ పాండీ కానలకంపు వాఁయుదువె క్రొ♦వ్వుంబట్టి యుద్ధక్రియా
పాండిత్యప్రథచేఁ దురుష్కులవి ♦ ధ్వస్తంబుఁ గావించి కో

దంశజ్యానినదంబు బూసిహృదయా ♦ స్థైర్యంబు భేదింప ను
ద్దండోదగ్రవిదారితారి నయి దో ♦ ర్దర్పంబుఁ జాటించెదన్.

ఇను—మాటిమాటికిఁ బద్మనాయకి బాహాబలాటోపం బెఱుంగక మిట్టి
పడు హైదరుజంగునకు వినాశనకాలము దాపైనది. ఈక్షత్రియ
మ్లేచ్ఛ పాశ్చాత్యసైనికద్వీపంబును మదీయ నిర్వక్రానన్యపరా
క్రమపారావారంబు క్షణంబున ముంచివేయఁగలదు. విజయ
రామకంఠనిర్యదుద్రుధిరధారాసరిజ్జాలంబుల, బొబ్బిలి పరిసరంబు
లఁ బ్రవహింపఁజేయనేని నే సినుగంటి ధర్మరాయుండనే? కాని!
పరిపంథులు కాచికొనుఁడు.

పరి—దేవా! ప్రత్యుత్తరము దయచేసినచో సెలవుఁ బుచ్చుకొనెద.

రంగా—ఓరీ! నీకుఁ దశవైనది. సచివా! హైదరుజంగుసాహెబుగారికి
"మా రాయబారి రానున్నాఁడు. వారివల్లనే సర్వంబు విశ
దంబు కాఁగల"దని యుత్తరంబు వ్రాసి తెమ్ము.

మంత్రి—(అట్లుచేసి) అయ్యా! వ్రాలుచేయుంపుఁడు.

రంగా—(చూచి చేవ్రాలు చేయుచున్నాఁడు.)

మంత్రి—(ఉత్తరముఁ బరిచారకున కొసంగుచున్నాఁడు)

పరి—స్వామీ! నా కనుజ్ఞయేనా?

రంగా—అహా! నీవింక వెళ్ళవచ్చును.

(పరిచారకుఁడు నిష్క్రమించును)

దామె—అయ్యా! ఇఁక నాకు ననుమతియేనా?

రంగా—దమ్మన్నగారూ! సంధిప్రయత్నంబులు విఫలంబులయ్యెనేని
సాహెబుతో నీరీతిగఁ బలుకుఁడు.

సీ॥ అవసరంబేనిఁ జా ♦ నైనఁ జత్తురుగాని
వెల్మవీరులు కోట ♦ విడువ రనుము
తనకోటి కోటిన ♦ ద్దారులకేనియుఁ
బద్మనాయకులు దు ♦ ర్వారు లనుము
మాటిమాటికిఁ బొల్లు ♦ మాటలు వెలువరిం
చినఁ బ్రాణమానముల్ ♦ చెల్లు ననుము
విజయరామునకు బొ ♦ బ్బిలి నీయఁ బనిలేదు
చావుఁదప్పించినఁ ♦ జాలుననుము
తే॥ గీ॥ న్యాయమున నెను దీయ ర ♦ న్యాయమునకు
బాల్పడఁగఁ బోరు బొబ్బిలి ♦ వారలనుము
'ధర్మమేవ జయతి' గాన ♦ దప్పదనిన
యుద్ధమున కీక్షణము మేము ♦ సిద్ధమనుము.

పాపా—సెబాసు; సర్వవైరిదుర్గర్వ ఖర్వంకరా! పద్మనాయకసద్వంశ పయఃపారావారరాకానిశాకరా! సెహబాసు.

వెంగ—అన్నగారూ! లెస్సగా సెలవిచ్చితిరి.

చెలి—ప్రభువుగారి వాక్యంబులు పద్మనాయ కాత్మగౌరవసంస్థాపన హేతు భూతములగుచున్నవి.

ఇను—రేచర్ల గోత్రోద్భవుల వచస్థితి శాత్రవగర్భనిర్భేదము.

దామె—దేవా! ఇఁక నా కనుజ్ఞయేనా?

రంగా—దమ్మన్నగారూ! పోయిరండు.

దామె—చిత్తము. (నిష్క్రమించును.)

రంగా—బంధువులారా! మన మొకటి తలంచిన దేవుఁ డొకటి తలంచు చున్నాఁడు. కాన సంధికి హైదరు రొడంబడుటకాని విజయ రాముఁడు సాగనిచ్చుట గాని సంభవింపదని యూహించు

చున్నాను. కీడెంచిగదా మేలెంచవలయును. ఒకవేళ సంధికుదు
రదేని యాచరణీయ మేమి?

వెంగ—రణమే కర్తవ్యము.

చెలి—వచ్చినఁ జత్తుముగాని కంఠగతప్రాణులమై యున్నఁ గోట వద
లుదుమే?

రంగా—యుద్ధమునందే కృతనిశ్చయులైతిరా?

పాపా—ఆహా! నిస్సందేహముగ.

ఇను—లేకున్నఁ దాతముత్తాత తండ్రులనుండి కల పద్మనాయకగౌర
వము వినాశమొనర్తుమే?

వెంగ—అన్నయ్యా! చలింపకుఁడు.

సీ॥ పాశ్చాత్య సైన్యంబు ♦ పంచబంగాళిపై
పిక్కబలంబుఁ జూ ♦ పించునట్లు
యవనచమూసమూ ♦ హము పటాపంచలై
చెడి కాలికిన్ బుద్ధి ♦ చెప్పునట్లు
క్షత్రియవాహినుల్ ♦ కగ్గోలుఁగని మల
మల సముదాలంబుగ ♦ మాఁడునట్లు
విమతసేనాని వ ♦ర్గము నుగ్గునూచమై
వెఱచి మఱలకుండ ♦ విఱుగునట్లు

తే॥ గీ॥ చేయువాఁడ సందీపితా ♦ మేయదుర్ని
వారదివ్యశరోద్భూత ♦ వహ్నిచేత
దశదిశావ్యాపితానన్య ♦ విశదయశముఁ
గూర్తు నగ్రజా! రేపర్లు ♦ గోత్రమునకు.

వెంగళరాయఁ డుద్దండ ప్రచండ కోదండ ద్వితీయుండై భండన
భూమి కవతరించిన, ఫాలాక్షుండేని తేఱిచూడలేఁడని యెఱుంగవా?

పాపా—బావా! రణమే నిశ్చయమగు నంతటి సుదినమె రావలయును
గాని విజయ మగుటకు నేమి?

ఉ॥ యవన పరాసుసైనిక మ ♦ హావిపినంబును మద్ధనుర్విము
క్త విశిఖజాత తీక్ష్ణశిఖఁ ♦ గాల్చెద, హైదరునొంచి మించి బూ
సి విజయరాముఁ జిత్రవధ ♦ సేసెద, నించెద బద్మనాయక
ప్రవిమల శాశ్వత ప్రథిత ♦ భాస్వ దనూనయశఃపరంపరల్.

చలి—కం॥ చంపెదము చచ్చెదము చలి
యింపఁదలంపము నిలింపు ♦ లెదిరించిన ని
ర్జింపఁగ నేర్తుము పంపినఁ
దెంపునఁదెగటార్తుము పగఁ ♦ దీర్తుము రిపులన్.

ఇను—ప్రభువుల కిప్పు డధికంబుగా మనవిచేసిన ముఖప్రీతి వాక్యంబులుగాఁ దోఁపవచ్చును గాని వదలిచూచినఁగాని దేవరవారి రాజబంధు పరాక్రమావిజృంభణము విశదంబుకాదు.

రంగా—తమ్ముఁడా! వెంగళరాయా! పద్మనాయక సద్వంశ సంభూతుండనై రేచర్లగోత్రోద్భవుండనగు నేను మాత్రము దురమునకు వెనుకంజ వేయుదునా! అం దనన్యసాధారణ ప్రజ్ఞాధురీణుండగు నీవంటి తమ్ముఁడే కాక విశేషించి తృణీకృత హరిహర బ్రహ్మాదులైనట్టి రాజబంధువులుకూడ నన్నుఁ గంటికి ఱెప్ప బోలెఁ గనుఁగొనుచుండ లోపమేమి? మఱియు—

చం॥ తెలియును దుర్నివారసము ♦ దీర్ణసమగ్ర పరాక్రమక్రమో
జ్జ్వలమగు వీరబొబ్బిలి ప్ర ♦ శస్తము దానికి రంగరాయ ని
శ్చల భుజదర్పసంజనిత ♦ శత్రువినాశన పౌరుషాగ్నికీ
లలును సహాయమై రణత ♦ లంబునఁ బూర్ణజయం బొసంగుతన్.

వెండియు యుద్ధవిషయమై మనమిపుడు చేయవలసిన ప్రయత్నము లేమేనియున్నవా యను సంశయము నిర్ధారణము సేయవలయును.

చలి—దేవా! రణమే నిశ్చయమగునేని శత్రుమార్గమధ్యంబున నున్న మన రాజాముకోట సంరక్షణ మత్యవసరము. కతిపయ సేనా

సహితముగ నచట నెవరేని యోధాగ్రేసరుఁడు కాపుండ వలయును. రాణ్మహేంద్రమునుండి బయలుదేరఁ దీసెనేని విజయరాముఁడు బూసి నా దారినే తీసికొనిరాఁగలఁడు. శాత్రవుని గొంతదవ్వున నెదిరించుటయు మనకు మేలే యగునని నాయభిప్రాయము విన్నవించు కొనుచున్నాఁడ.

రంగా—చెలికాని వెంకయ్యగారి నుడువులు యథార్థములు. రాజాము సంరక్షణము సేయుటకుఁ బాపయ్యగారే సమర్థులు. వీరబొబ్బిలి యోధాగ్రేసరులలో నీయన ప్రాపుననే రాజాము సురక్షితమగునని తలంతును.

ఇను—ఎవరైనను రాజాముకోటను జాగరూకతతో గాపాడవలయును.

పాప—ఔను!

శా॥ చండారాతివరూధినీవిదళ నో ♦ త్సాహంబునఁ వైరివే
దండానీకవిదారణోద్యమ మృగేం ♦ ద్రంబైన నా పయ్య కా
పుండంజొచ్చు టసంభవంబు విమత ♦ వ్యూహంబు రాజాము, స్థా
ణుం డేతెంచిన నిల్వరింతు విరతా ♦ నూన ప్రతాపంబునఁ.

కాని— (అని సంశయించుచున్నాఁడు.)

రంగా—ఏమి పాపయ్యా! రాజాముప్రయాణమునకుఁ 'గాని' యని నిరుత్సాహంబు సూచించుచున్నాఁడవు. (అని బుజముపైఁ జేయి వేయుచున్నాఁడు.)

పాప—స్వామీ! ప్రభు సమాజ్ఞా శృంఖలాబంధీకృతుఁడనైన తరువాత యేదియేని యలంఘ్యమే. అయినను (విచారముతో),

సీ॥ రాజాముకోట సం ♦ రక్షణ గురుకార్య
భారంబుఁ దాల్చిన ♦ వాఁడనౌటఁ
గలనైన నెడఁబాయఁ ♦ గా రాని బొబ్బిలి
పరిసరంబుల వీడు ♦ వాఁడనౌటఁ

ప్రాణంబులతో భ ♦ వత్సన్నిధానంబు
వదలి పోవలసిన ♦ వాఁడస
రణకళా వైదుషీఁ ♦ బ్రిభువగోత్రముఁ గి
న్పుఁడు పవలసినట్టి ♦ వాఁడనౌట
తే॥ గీ॥ నాడకున్నవి కాళ్ళు ప్రి ♦ యాణమునకుఁ
దిరుగు తరుగుండఁగూడదు ♦ దేవరాన
వెళ్లిరమ్మంచుఁ జేకూసు ♦ విజయమంచు
నన్ను దీవించి సెలవిమ్ము ♦ నతు లొనర్తు.
(అని పాదములపైఁ బడుచున్నాఁడు.)

రంగా—(ఆనందబాష్పములతో లేవఁదీయుచు) నాయనా! పాప
య్యా! నాయెడఁబాటు నీకెట్లు దుర్భరమో నీవియోగము
నాకంతటి దుర్భరమే గాని విధి దుర్నివారము. సాశయింపకుము.

శా॥ రంగారాయ నిజప్రతాపము రిపు ♦ ప్రాణాపహారక్రియో
త్తుంగాటోప విజృంభమాణ విజయో ♦ ద్యోగంబుఁ గల్పించుఁ బూ
ర్ణాంగీకారము వెల్లడింపు ప్రభుకా ♦ ర్యాసక్తిఁ బ్రత్యర్థిమా
తంగాంగ ప్రహితప్రమోదిత మృగేం ♦ ద్రా! గెల్పు చేకూరులెర్.

పాప—ధన్యోస్మి! దేవరవారి యాశీర్వచన మమోఘముకదా! ఇఁక
హరిహరాదు లడ్డినను సంశయింపను.

ఉ॥ కొండలఁ బిండిఁజేసెద న ♦ కుంఠితశక్తి జగత్రిమైకదో
శ్చండ పరాక్రమ ప్రథితి ♦ సారదవానలమందు విద్విష
త్కాండముఁబట్టి వ్రేల్తుఁ బ్రభు ♦ కార్యభరంబును నిర్వహింతు; బ్ర
హ్మాండయశః ప్రకల్పిత మ♦హా విభవాన్వితఁ జేతు బొబ్బిలిర్.
మఱియు,

ఉ॥ నాకపతిప్రతాపము జ♦నార్దన దుర్ధరచక్రవిక్రమో
ద్రేకము నీలలోహితని ♦ రీక్షణతీక్ష్ణశిఖావళీసము

త్సేకము దుష్కృ[illegible] నొక ♦ [illegible] కాండ్రకులోద్భవా[illegible]
ర్యాకరదుర్నివారణిశి ♦ [illegible] [illegible] వెట

రంగా—(సంతోషముతో) నిశ్చయము. నిశ్చయము.

కం. కాండ్రకులోద్భవమగు ప్రలి
కాంద్రిమనుచు రిపుకురంగ ♦ కంబులపైనిఁ
దీండ్రపు రోషమునంబడి
గండ్రిలు గావించు టొక్క ♦ కిష్టంబగునే?

పాపా—(చేతు లొగ్గి) ఇదియంతయు భవదనుగ్రహము. తడవగు చున్నది. నాకు సెలవు బ్రసాదింపుఁడు. ఓమాతృదేశపరిరక్షాదక్షు దీక్షాబద్ధకంకణులారా! ఓప్రత్యర్థికంఠవిలుంఠనక్రియా కుతూహాలోపేత వీరపద్మనాయకులారా! మేల్కొనుఁడు. మేల్కొనుఁడు! ఓహో! దేశీయసోదరులారా! భారతీయాత్మగౌరవ వినాశనకారణమైన తుచ్ఛమ్లేచ్ఛసామ్రాజ్యాధికారనిరంకుశ ప్రాబల్యప్రభంజనము నకై వెనుదీయుట మాతృభూమి యభీష్ట ముకాదు కావున,

సీ॥ ఆత్మగౌరవరక్ష ♦ నార్థమై ప్రాణత్ర
ణప్రాయమంచుఁ బె ♦ నంగవలయు
వెల్మకులద్వేషి ♦ విజయరాముని సంహ
రింపఁ గంకణము ధ ♦ రింపవలయుఁ
బాశ్చాత్యసేనకు ♦ భరతపుత్రుల బలో
ద్రేక మీతూరి బో ♦ ధింపవలయు
జన్బిరెయో పగతుర ♦ వ్రచ్చిరెయో దశదిగ్వి
శదయశచ్ఛట వెదఁ ♦ జల్లవలయు
తే॥ గీ॥ మరణమున్న దొకప్పుడు ♦ మానవునకు
సద్యశం బొక్కటే చిర ♦ స్థాయిగాన

యుద్ధరంగాని కుఱుక సం♦న్నద్ధపడుఁడు
దళితపరిపంథులార! ఓ ♦ వెలమలార!

శా॥ వాలుఁ గా డాలును గేలఁ గీల్కొల్పి దు ♦ ర్వారాహవప్రాభవో
ద్వేలాభీలకరాళవిక్రమకళా ♦ విస్తారులై భారతీ
యాలోకప్రతిభావిశేషమునఁ ♦ రాజ్యస్థాపనోత్సాహులై
లే లెండీ! యిఁక వెల్మవీరులు యశో ♦ లేశంబు నాసింపుఁడీ!

సీ॥ రాజాముకోట భా ♦ రము నాది బొబ్బిలి
రక్షించుకొంట జా ♦ గ్రత్తనుండు
చావుప్రాప్తంబైన ♦ సంతసంబేగాని
రణపరాఙ్ముఖము మా ♦ త్రంబు వలదు
జ్ఞప్తియుంచుఁడు పద్మ ♦ నాయకవంశ ప
రంపరాగత యశః ♦ ప్రాభవంబు
రక్తప్రవాహముల్ ♦ ప్రసరింపఁగాఁ జేసి
ప్రభుఋణము_త్తీర్ప ♦ పాటుపడుఁడు
తే॥ గీ॥ మానమేగిన వెనుక నీ ♦ ప్రాణమేల
ప్రస్తుతంపు విధ్యుక్తధ ♦ ర్మంబు లెంచి
యశము నిల్పుఁడాచంద్ర తా ♦ రార్కముగను
విమత సమవర్తులార! ఓ ♦ వెలమలార!

మ॥ అనివార్యప్రభుకార్యనిర్వహణ భా ♦ గ్యాపేక్ష రాజాముకో
టను రక్షింపఁగఁ బోవఁగా వలసె ద్వి ♦ ట్సంతాన సంతాపకా
రణుఁడీ పాపడు మాన్పు మ్లేచ్ఛకుల సా ♦ మ్రాజ్య ప్రభుత్వంబు నీ
వనుమానింపకు పోయివత్తు సెలవి ♦ మ్మా! వెల్మ సంస్థానమా!

(తెరలో) జే పాపరాణ్ణాణికి జే !!
(వెలమ వీరులు "పురేపురే" అని చప్పటలు చఱచుచున్నారు.)
(పాపారాయుఁడు నిష్క్రమించును.)

రంగా—సభాసదులారా! మనప్రయత్నములు యథావిధి సలుపబడినవి. బందరుపురమున నున్న గోరుందొరవారి యొద్ద కొలువీకుని బంపి యాతనిచే మన నిర్దోషిత్వము బుస్సి గారికిఁ జెప్పింపవలయును. కాన నేరినేని నియోగించి ఫలితాంశము నకు మాత్ర మెదురుచూతము.

(అందఱు నిష్క్రమింతురు)

(ప్రథమాఙ్కము)





శ్రీమత్పరదేవతాయై నమః



# బొబ్బిలి

## (పద్మనాయక విజయము)

## ద్వితీయాంకము

(హైదరుజంగు దేవిడి పురోభాగము)

విజ—(ప్రవేశించి) పరాసు తురుష్క సహాయసంపద్విశేషంబున నేఁటికిఁగదా విజయరామావనీనాథుఁడు సఫలీకృత మనోరథుండ నగుదునని సంతోషింపవలసియున్నది. దైవకృపాతిశయ మిట్లు గదా పరిణమింపవలెను. ఇఁక విజయనగరాధీశునకుఁ గొదవ లేదు. కృతార్థుఁడు.

మ॥ స్థిరశౌర్యోన్నత పద్మనాయక బలో ♦ ద్రేకంబు చల్లారు దు
స్తరపాశ్చాత్యతురుష్క నూత్నరణ వి ♦ ద్యచ్ఛక్తి, శాంతించు మ
త్పరిభావోగ్రదవానలంబు, ముదితో ♦ త్సాహంబుపై బొబ్బిలిన్
బరిపాలించెద వైభవం బినుమడిం ♦ పన్ స్వల్పకాలంబునన్॥

ద్వాదశలక్షరూప్యంబులు పోయినఁబోవుఁగాక! హైదరు నా వాఁడయ్యె! బూసిని నావానిం జేసెద. బొబ్బిలిపేరు మాయుదినము వచ్చె. హైదరుజంగుసాహేబు నాగీచినగీటు దాఁటఁడు. పద్మనాయకులపై పగఁ బాపుకొనుటకుఁ జక్కని సమయము చేకూరినది. పాశ్చాత్య

కృతఘ్నకాదకముయుండు పద్మనాయకుల కెంతటివారైనను జేయునది యేమియులేదు. హైదరు జారీచేసిన తాఖీదునకు రంగారావు లొంగు ననుట కల్ల. కోట విడువరేని సాహేబు మిన్నకుండఁడు. ఇన్ని యూహ లేల? ఏమైనను బొబ్బిలి నాకుఁ దక్కినట్లె. అట్లేయేమి? దక్కినది. కానీ, తడయక నేసిప్పుడు హైదరుకొల్వుకూటమునకుఁ బోయి యాతని కోపాగ్ని శాంతింపనీయక మఱింతఁ బ్రజ్వలింపఁజేసెదను. (అని పరిక్రమించి) ఖానువర్యా! సలాము.

హైదరు—(హుక్కాపీల్చుచు) విజయనగరాధీశులకు సలాము. దయ చేసి యీపీఠ మలంకరింపుఁడు. (ఇరువురు కూర్చుందురు)

విజ—ఖానువర్యా! తాము బొబ్బిలి కనిపిన పరిచారకుఁడే తేరినాఁడా?

హైదరు—ఇంకను వచ్చినట్లు కాన్పింపదు. రావలసినపనియు నుండదు. మనయాన మౌళిఁదాల్చి రంగారాయఁ డిదివరకే బొబ్బిలి విడిచి యుండును. భీషణము గ్వాలంఘ్య హైదరువచః ప్రచారము నకు వ్యతిరేక మెన్నఁటికిని జరుగదు. ఈక్షణమునకో మరియొక క్షణమునకో పరిచారకునివలన వెల్మలు కోటవిడిచినటుల వినఁగలము.

విజ—(తనలో) సాహేబునకు వీరబొబ్బిలి విషయ మనుభవమున్నట్లు కాన్పింపదు. (ప్రకాశముగా) తురుష్క మంత్రి సత్తమా! మీరేమని తలంచితిరో కాని—

శా॥ దోషప్రాభవ దుర్విదగ్ధులు దురు ♦ ద్యోగప్రభాసితవి
శ్వాస ద్రోహపరీతవర్తనులు దు ♦ ర్వారోగ్ర సంగ్రామ వి
ద్యా సాహిత్య రమాధురంధరులు స్వా ♦ తంత్ర్య ప్రభుత్వ ప్రతి
ష్ఠా సంకల్పులు వెల్మవీరులు త్వది ♦ ష్టవ్యాప్తి నంధంతురే?

పరాసు సామ్రాజ్యశాసన నిరాకరోరణోద్యము పద్మనాయకులు మాటలం గోటలు విడుచుటకల్ల. వెల్మల దార్ఢ్యము, పలుమారు చవిఁజూచిన నాకుఁగాని తమకేమి తెలియును?

హైదరు—రాజా! నాకేమి తెలియునా? కోటను బోరాటమునఁ గాగి మాటల విడువరనియా! అనియెదవు? ఒక సామాన్య వెలమ ప్రభు నింతచేసి నాచెంతనే సంభాషించు చున్నావుగా! ఓ-క్కలి పిటికివానివలెఁ గాన్పించు చున్నావు. సంగరరంగంబున ఫరంగీ ఫిరంగీలముందు రంగారా వెంత? తదనుచరులెంత?

విజ—కోపించిన మనవి సేయఁజాలను. అవధరింపుడు.

శా॥ గాంగేయప్రతిమాన భూవినుత రం ♦ గారాయనిస్తుందద్రిదో
స్సాంగత్యంబున విక్రమ ప్రకట నా ♦ సక్తస్వభావంబునన్
వెంగళ్రాయఁడు బాసటు డఁగ ఫిరం ♦ గీలేవి లొంగున్ సమి
ద్రంగభద్రావ తాండ్రపాపయమహా ♦ గ్రక్రోధవిస్ఫూర్తికిన్.

హైదరు—ఏమి! నీయతిశయోక్తు లనంతములుగానున్నవి. జగత్ప్రమైక సంభావిత పాశ్చాత్య శతఘ్నికానినదశ్రవణమాత్రమున గుండియ లవసి రంగారాయఁడు పాదాక్రాంతుడై నాశరణుఁ జొచ్చునటు లొనర్పకున్న నేను సాహెబుబిడ్డనే?

విజ—మంత్రివరా! నావలననేకాదు. మీ యిచ్చవచ్చిన వారివలన దెలిసికొనుఁడు. వారి బలపరాక్రమాతిశయంబులు వివదఁబులు కాఁగలవు. వా రిదివఱ కనేక యవనప్రభువులనుగూడ నోడించితిమని విఱ్ఱవీగుచున్నారు. వారికింగల పౌరుషాదు లున్నవి యున్నట్లు వర్ణింపఁగల్గినఁ జాలును. అతిశయోక్తు లాడినంత ఫలము. చిత్తగింపుఁడు.

శా॥ గాండీవి ప్రతిభాసమన్విత మహా ♦ గ్రస్ఫూర్తి నుద్దండ కో
దండప్రోద్భవ నిర్భరాశుగ సము ♦ ద్రింబందుఁ బ్రిత్యర్థిరా

ట్టండద్వీపము ముంచు బొబ్బిలి పయిని ♦ దండెత్తిచాకుండఁ బో
కుండగ మూర్ఛిలకుండ నుండఁగలవా ♦ డున్నాఁడె భూమండలిన్.

హైదరు—కుత్రియవాగ్వైఖరి యసహ్యముగా నున్నది. శాత్రవుల నింతయెత్తి ప్రశంసించు నిన్ను శూరంమన్యునిగా భావించెదను. పద్మనాయకులెట్టి బలసంపన్నులైనను బాశ్చాత్యరణసాధనంబుల బారి భస్మీభూతులై పోవరా?

విజ—మంత్రివర్యా! నామాటలు నమ్మకున్నారుగాని

సీ॥ మూర్తిభవించిన ♦ భువనత్రయైక కో
దండ విద్యాధురం ♦ ధరులనంగ
ఆవిర్భవించిన ♦ హరి హర బ్రహ్మాదు
ర్భేద్య పరాక్రమో ♦ పేతులనఁగ
సనుప మోదగ్ర చ ♦ క్రాగ్ని కేసియుఁ గా ల్చ
దల్పని సాహసో ♦ ద్దాములనఁగ
లోకభయంకరా ♦ స్తోకశౌర్యాటోప
భీమదోర్బల సము ♦ న్వితులనంగఁ

తే॥గీ॥ దగిన పద్మనాయకులతోఁ ♦ బగవహించి
విజయసంసిద్ధి కాసింప ♦ వీలులేదు.
యేపన పాశ్చాత్య వాహినీ ♦ నివహముసకుఁ
జక్రితోఁ హైన ,వారు దు ♦ ర్జయులె సుమ్మ.

హైదరు—ధూ! ఇఁక నీవ్రసంగ మింతితో విరమింపుము. ప్రత్యర్థిమత్తమాతంగ మృగేంద్ర సాదృశ్య పరాక్రమ స్ఫురిత లాలూఖానుండును, విరోధి ఘనఝంఝానిలప్రాయ శౌర్యాటోప హాసనల్లీఖానుండును. పరిపంథినాళీక మదకుంజర ప్రతిమానవిక్రమోదార,లాసూఖానుండును, శత్రువేశ్యాభుజంగ సామ్య ప్రతాపస్థిర షుకురుల్లాఖానుండును, వైరివీరారణ్య నిర్మూలన హేతుభూత దైవదుర్నివార కఠోర కుఠార పాండితీదవాన

లుండగ నీహైదరుజంగుఖానువశ్యంబును గలుగ యవన సైన్యంబు వెన్నుజూపుటకేకాని చేరెత్తుటకేని మానవ మాత్రుల వశమా! రంగారాయఁ డీపాటికిఁ గోట విడిచిన సరియె. లేకున్న మూడవ ఘూటకు బొబ్బిలి కోటయావత్తుమాపకున్న నేను మహాత్ముని పాదంబులకుఁ దప్పిన వాఁడ నయ్యెదను.

విజ—(తనలో) సాహెబు కోపానలము బాగుగ రేఁగినది. అతి సర్వత్ర వర్ధింపఁదగినది. ఇఁక నా యింధన ప్రయోగము ముగింతును. (ప్రకాశముగ) నిజముగ మనవిచేసిన నాగ్రహించుచున్నారు. ఇంతట విరమింతును.

హైదరు—రాజా! అట్లుకాదు. నను మతించిన కోపాతిరేకంబున నేమేని దురుసు ప్రసంగము చేసిన సైరింపుము. సత్యము వచింపుము. పద్మనాయకులు నిజముగా నీవు చెప్పునంతటి పరాక్రమశాలు రేనా?

విజ—దేవా! అందుకు సందేహమా! శాంతేయప్రతిమానరంగారాయ వెంగళరాయపాపారాయలును మాద్రేయతుల్య లితరపద్మ నాయకరాజబంధువర్గంబును నెల్లి సంగ్రామతలంబునఁ బ్రత్యా లీఢపాదులై నిలిచి ధనుర్విద్యావైశద్యంబును మల్లయుద్ధవిశా రదత్వంబును ఖడ్గరణప్రచారంబును వెల్లడించునప్పుడు తమకే సర్వమును స్పష్టపడఁగలదు.

హైదరు—రాజా! అట్లయిన బొబ్బిలి గడివిషయమై యుపేక్షాభావం బున నుండరాదు. పరిచారక సందేశానంతరము కర్తవ్యమూ హించెదను.

విజ—మంత్రివర్యా! తా ముపేక్షాస్వభావంబున నుండురని యింతగా వచించితినిగాని శ్రద్ధవహించిన నీకార్యంబు దేవరవారి కాక లెక్కలోనిది కాదు. ప్రభువు లేమిగా భావించెదరోగాని, వారి

విపత్తయమై తలంచిన నాకుమాత్రి మింతయంత యనరాని యనర్థము జనించును. సర్కారు సిస్తుదస్తులు వారు చెల్లించకపోఁగాఁ బరిసరప్రభువులనుఁగూడఁ జెల్లింపవలదని ప్రోత్సాహ పెట్టుచున్నారు. ఇది మీకుఁ దగదు. 'రాజద్రోహము,' అని యెన్నిసారులు బ్రతిమాలినను "ఛీ! పద్మనాయక సంస్థానము సామ్రాజ్య ప్రభుత్వ మంగీకరించునా?" అని నిరాదరణ సేయుచువచ్చిరి. పైపెచ్చు న్యాయని సద్రిమాందోళనమే యని వాదింతురు.

హైదరు—ఆఁ! మ్లేచ్ఛసామ్రాజ్యప్రభుత్వము నంగీకరింపఁడేమి? బొబ్బిలిధ్వంసముఁజేయు నాకిపు డెవఁడడ్డుపడి తనను రక్షించునో చూచెదఁగాక! వెలమకుల వినాశన మాచరించి నిన్ను బొబ్బిలిరాజ్యాభిషిక్తుఁ గావించెద నని కత్తియెత్తి యల్లాసాక్షిగ బ్రతిజ్ఞ చేయుచున్నాఁడ. నీవు నిర్భీతిగ నుండుము.

విజ—ధన్యోస్మి! ధన్యోస్మి!

మ॥ పరరాజ్యప్రతిభావినాశనము ను • ద్వాంఛాఫలవ్యాప్తి దు
ర్భరదోర్గర్విత రంగరాయకుల వి • ధ్వస్తంబు పాశ్చాత్యసం
గరవిద్యామహిమాప్రదర్శనము లో•కక్షేమసంధాన సం
భరముల్ జేకుఱితీరు మ్లేచ్ఛకరుణా • వైశేష్యసంప్రాప్తిమై.

హైదరు—విజయరామరాజా! ఆ శేషించిన సగముసొమ్ము త్వరలో నందింపవలయును.

విజ—చిత్తము. ఆలాగే. ఈ మజిలీనుండి బయలుదేరక పూర్వమే యొసంగఁగలను. (తనలో) తురకలు ముందు, లాచము వెనుకఁ బుట్టినటులున్నది. (ప్రకాశముగ) అదుగో! బొబ్బిలికివెళ్లిన పరిచారకుఁ డరుదెంచుచున్నాఁడు.

పరిచా—(ప్రవేశించి ప్రభువుగారి పాదముల కొఱఁగుచున్నాఁడు.)

హైదరు—ఏమిరా ప్రత్యుత్తరము?

పరి—దేవా! రంగారావుగారు తమ కీయుత్తరమొసంగుమనిరి. (అని యిచ్చును)

హైదరు—రాజా! తెలుంగున వ్రాయఁబడినది. చదువుము.

విజ—(అందికొని ప్రకాశముగ) మహారాజశ్రీ శ్రీగోల్కొండ నవాబువారి మంత్రి సన్నిధికి, రాజా రావు రంగరావు బహద్దరు వారి నమః పూర్వక విజ్ఞప్తి. తమ లేఖను నందుకొంటిమి. పద్మనాయకులు న్యాయబద్ధమైన ప్రభుత్వమువారి యాజ్ఞ శిర సావహించి తీరెదరు. సర్వము విశదీకరింపఁజాలు దూతుని బంపి నాఁడను. ఇట్లు- విధేయుఁడు రాజా రంగారావు బహద్దరు.

హైదరు—ఔరా! ఇంకను దూతలు దౌత్యంబులేనా? న్యాయమే కానిమ్ము. అన్యాయమే కానిమ్ము. నాయాజ్ఞ జవదాటఁగల వాఁడా తాను? సేవకా! ఇంకను జెప్పవలసిన బొబ్బిలి విశేషము లేమైనఁ గలిగిన మనవిచేసి వెళ్లవచ్చును.

పరి—ప్రభూ! విశేషఁబులేమి కలవుగాని వెలమదొరలు తమ లేఖను నందినతోడనే భగ్గుభగ్గున మంటలెగయు నాజ్య పూరిత వీతిహోత్రునివలె కోప దుర్నిరీక్ష్యులై వారివారి బల పరాక్రమాతిశయంబుల వెల్లడించిరి. నే నీ సందడిలోఁ బ్రతికి బైటఁబడినఁ బదివేలనుకొని ప్రత్యుత్తరమిచ్చిన సెలవుఁ గైకొందుమని వేఁడఁగాఁ బ్రత్యుత్తరమొసంగి నన్నంపిరి. వారంపిన రాయబారియు దర్శనార్థమై ద్వారమున వేచియున్నాఁడు.

హైదరు—అట్లైన నీవేగి బూసిదొరవారికీ వృత్తాంతముఁ దెలియఁజేసి నీపనిమీఁద నుండుము.

పరి—చిత్తము. (పోఁబోయి) బూసిదొరవారే సభాభవనంబునకే విచ్చేయుచున్నారు.

హైదరు—సరి. వెలమ రాయబారిం బ్రవేశపెట్టుము.

పరిచా—చిత్తము. (నిష్క్రమించును)

(బూసిరాకఁజూచి హైదరుజంగు, రామరాజు సలాము లొనర్చి నిల్తురు!

బూసి—(ప్రవేశించి) మీరుమీరుపీఠములఁ నలంకరింపుఁడు. మంత్రీ! బొబ్బిలి వార్తలేమి?

హైదరు—ఏమున్నవి! కోట ఖాళీచేయక ఘన యుద్ధోల్లంఘనము జరపిరి. రంగారా విప్పటికైనను మీదర్శనమునకు రాక యొక రాయబారినిమాత్రి మంపెను. మనమంపిన తాఖీదును జూచి మరాగ్రహావేశులై వెలము లధికప్రసంగము గావించిరని పరిచారకుఁడు నుడివెను.

బూసి—మనతాఖీదునకు జవాబైన వ్రాయలేదా!

హైదరు—వ్రాయ కేమి? మాప్రతినిధివలననే సర్వము విశదమగునని యొకచీటి వ్రాసెను. ఆరాయబారియు వచ్చుచున్నాఁడు. (పరిచారక ద్వితీయులై దమ్మన్నగారు ప్రవేశింతురు.)

పరి—దమ్మన్నగారూ! వారే బూసిదొరగారు. వీరు హైదరుజంగు సాహెబుగారు. ఆమూడవవారు విజయరామరాజుగారు. ఇఁక నేను సెలవుఁగైకొందును. (నిష్క్రమించును)

దామె—(తనలో) అక్కటా! ఎట్టి అసమయమున వచ్చితిని. విజయరాముని సముఖమున సంధిసందర్భమా? అదియును గాక బూసి హైదరుల వేర్వేర సందర్శించినఁ గార్యసాఫల్య మయ్యెడి దేమో? ఏది యెట్లయిన నిఁక జేయఁగిన దేమియు లేదు. (ప్రకాశముగ) పరాసు సేనాధ్యక్షులకును తురుష్క మంత్రి సత్తములకును సలా మొనర్చుచున్నాను.

బూసి—
హైదరు— } (మారుసలాములు చేయుదురు.)

బూసి—అయ్యా! ఆపీఠ మలంకరింపుఁడు.

దమ్మ—(కూర్చుండి తనలో) ఇంతవరకు యుక్తముగానే యున్నది.

హైదరు—మీరెవరు? ఎందుకై మీరాక?

దమ్మ—(త్వరలో) అప్పుడే తుకుమ్మకాలాహి హాలాహలము వెడలఁ గ్రక్కుచున్నది. (ప్రకాశముగ) అయ్యా! నేను బద్మనాయక సద్వంశసంభూతుండను. దామెరదమ్మన్నగారు నామధేయము. బొబ్బిలి ప్రభువుగారి బంధువుఁడను. తమ తాఖీదుపై బొబ్బిలి సంస్థానము నిరపరాధమని విన్నవింప రంగారావుగారిపంపున వచ్చితిని. ఈసమాచార మిదివరకే పరిచారకునివలన విని యుందురు.

హైద—ఏమీ! వెలమవారు నిరపరాధు లనఁగా మేము సాపరాధుల మనియా నీతాత్పర్యము?

దమ్మ—ఖానువర్యా! ఎవ రపరాధులను చర్చయుం దేము నిరపరాధుల మనిన దమ యూహకు సందుగలదుగాని నావాక్యమున కపార్థము లేదు.

హైదరు—అపార్థమే కాదు. రాజదూషణ, రాజద్రోహము కూడఁగలదు.

బూసి—సరి. సరి. మీరాయబార మేమో వినిపింపుఁడు.

దమ్మ—చిత్తము.

చ॥ త్వరపడి తాము వెల్మపరి ♦ పంథివచతి విశ్వసించి యు
త్తరువిడినారు మాపురము ♦ దాయకొసంగెదమంచు దుష్పథం
బెఱుఁగము కిన్కయేల యెవు ♦ డేనియు మా యెడఁగానిచొప్పు గ
బఱచిన మాళిఁదాల్తుము ది ♦ వాణము వారు విధించు శిక్షలన్.

లేనేలేదు తప్పు. మావలనఁ గల్గెనే యనుఁడు. మా కోట సరకారు స్వాధీనముం జేసికొన నగుఁగాని మా విరోధ కర్పింపఁగలమనుట న్యాయమా? పద్మనాయకులు న్యాయబద్ధులు. అధర్మమున నడుగిడరు ధర్మము సకల సామ్రాజ్యములోనైనఁ బ్రతిఘటింపఁగలము కాని—

ఉ॥ అంచితచిత్తులైన ప్రభు ♦ లాగ్రహమూనుట దూరదేశమే
తెంచితి వచ్చి యచ్చటి స్థి ♦ తిఁ వివరించితి ధర్మమార్గమూ
హించుటలెన్న వారలక ♦ భీప్సితసిద్ధియొనర్చి పోరుఁ గ
ల్పించి వృథావిరోధములఁ ♦ బెంచిన సౌఖ్యముగాంచ రెవ్వరుఁ.

కనుక విషయముఁ జక్కఁగఁ బరిశీలింపుఁడు.

బూసి—ఏమంటిరి? మీవిరోధులమాటల విశ్వసించి కోపించితిమిగాని మీరు నిర్దోషులేనా? తప్పుఁ గన్నరుపవలయునా? ఏడు సంవత్సరముల కప్ప మెగవేయుఁదలఁచుట తప్పుకాదా? రాజ ద్రోహ మింతకంటె వేరుకలదా?

దమ్మ—హరిహర్! ఎంతబెట్టిదపు వాక్యము సెలవిచ్చితిరి? భార తీయులు రాజద్రోహులనుట యనుభవములేని మాట. దేవా!

మ॥ జనసందోహక మచ్చటఁ బ్రబల రా ♦ జద్రోహచేతస్క మే
యనువాదం బధికారికల్పితము ద్రో ♦ హారోపణప్రక్రియా
ఘను లీదేశవిరోధులుంగలసి రాఁ ♦ గయ్యాలతుం గాలుఁ ద్రి
ప్పిన సామ్రాజ్యపు గౌరవాతిశయముల్ ♦ పెంపొందఁగా నేర్చునే.

కప్పము బకాయిపడినమాత్రముననే రాజద్రోహము కావలసి యున్న విజయరామరాజాదులుగూడ నిన్నమొన్నఁగదా చెల్లించిరి. మఱియుఁ గప్పము విజయనగరాధిపుద్వారా తమకుఁ జెల్లింపవలసి యుండుట వానికిని మాకునుగల వైరమున నట్లు చేయఁజాలమైతిమి.

బూసి—దమ్మన్నగారూ! మీకు మీకింతటిబలవచ్చుతుంత్వమేల ప్రాప్తించెనో?

దమ్మ—ప్రబలకారణ మేమికలదుగాని కొన్నికొన్ని కొండవాఁగుల హక్కుభుక్తముల గుఱించి మాకుమాకు మనస్పర్థలు కలిగి చిరకాలమునుండియు నభివృద్ధియగుచున్నవి.

బూసి—అట్లయిన\ బోనిండు. కప్పము హుజారునకే పంపరైతిరేల?

దమ్మ—అట్లానర్పకపోవుట లోపమేగాని సరకారువారి నిప్పమెగ వేయువలె ననుదురుద్దేశము లేదు. 'ప్రిమాదోధీమతామపి' అనికదా న్యాయము. బొబ్బిలిపై నాగ్రిహమునకీకప్పమే కారణమైనచో జరిగిన యేడుసంవత్సరముల ధనముకాదు, జరుగనున్న యేడుసంవత్సరముల ధనము\ గోరినను నేడు దాఖలు చేసికొనఁగలము. మాయందు వైరము మానుఁడు.

బూసి—మంత్రిగారూ! మనకు రావలసిన కప్ప మొసంగెదమనుచుండ నిష్కారణవైర మేల?

హైదరు—దేవా! మన తాఖీదులపై వారు చూపించిన నిర్లక్ష్యస్వభావంబును మనము విజయరామరాజుగారి కొసంగిన యభయంబు నెఱింగియు దమ్మన్నగారి కపటోపాయంబులకుఁ జిక్కిన నేమని మనవి చేయఁగలను?

దమ్మ—మంత్రివర్యా! దివాణమువారి యుత్తరువులయెడ మేము నిర్లక్ష్యము వహించితిమా? ఇది కల్పితము.

హైదరు—మీరు మా తాఖీదులు చేరుటలైన నొప్పుకొందురా?

దమ్మ—ప్రిప్రిథమమున మమ్ము రావలసినదసిన యుత్తరువు చేరినది. దానికి మా ప్రిభువువారు "తమ్ముని వివాహము చేరువవైనది. బొబ్బిలి పరిసరపుమజిలీలలోఁ గప్పముతో దర్శనము చేయఁగల"మని ప్రిత్యుత్తర మంపుకొనియున్నారు. నేఁటియుత్తరువునకు నేను రానేవచ్చితిని. ఇంక నిర్లక్ష్యమెచ్చట? తమరే సెలవిండు.

హైదరు—మిమ్మన్న రమ్మని నాలుగు తాఖీదులు జారీచేసితిని. ఒక్కటే యని బొంకెదవుగా! పైపెచ్చు మొదటి తాఖీదునకుఁ బ్రిత్యు

త్తర మంపితిరిగా! అసత్యవాక్కల్పనాచాతుర్యము వెల్లడింపకుము.

విజ—(తనలో) మధ్య రెండు తాఖీదులును బొబ్బిలివారి కందకుండఁ జేయుట యిప్పు డెంతయో నాకు సాయపడుచున్నది.

బూసి—బొబ్బిలి కంపిన తాఖీదులు నాల్గనియు మీరు ప్రత్యుత్తర మంపలేదనియు నేనుకూడఁ నెఱుగుదును.

దమ్మ—దేవా! తమయుత్తరువులు మాకుఁ దెలియకుండుటయు మా విజ్ఞప్తులు తమకుఁ జేరకపోవుటయు మామదృష్టమే. పోనిండు. ఇంత సిద్ధాంతరాద్ధాంతము లెందులకు?

ఉ॥ తప్పులె చేసినారము స ♦ తంబు క్షమింపఁగఁ గేలుమోడ్చినా
మిప్పుడు రాజధర్మము గ్రహించియె ♦ తీఱవలెఁ శరణ్యమ
న్నప్పుడు దుష్ప్రవర్తకుని ♦ నైనను దేవరవారి చిత్తమా
చొప్పుఁ బరిష్కరింపుఁ డన ♦ న్యాయ వహింపుఁడు వెల్మవారిపై.

బూసి—(తనలో) హైదరు పద్మనాయకులు పట్టి దురహంకారులని వచించి యున్నాఁడు. దమ్మన్నగారి శాంతిస్వభావ మెంతవర్ణనాతీతము? మంత్రి విజయరాముని వలలోఁ జిక్కినటు లున్నది. రెండు తాఖీదులే చేరిన వనుచున్నారు. నిజమే యైయుండును. హైదరు లంచము గ్రహించి బొబ్బిలి సాధించి విజయనగరాధిపున కర్పింపవలయునని దృఢసంకల్పుఁడై యున్నట్లు మచిలీపట్టణమునుండి మిత్రుఁడు గోరుందొర వ్రాసినది సత్యమని తలంచుచున్నాను. నిశ్చయముగ నా తాఖీదులకు బొబ్బిలివారు ప్రత్యుత్తరము వ్రాసియేయుందురు.

హైదరు—(తనలో) ఈదమ్మన్నగారి వినయసంపత్తికి బూసి మనసు కరఁగినటులున్నది. (ప్రకాశముగ) దేవా! మీ రాలోచింపఁ బనిలేదు. చంకదుడ్డు శరణార్థులుగారా వీరు? తత్క్షణము కోట

ఖాళీచేయు మనుఁడు. లేకున్నఁ బోరాటమునకు సిద్ధపడు మని సెలవిమ్ము.

దమ్మ—(తనలో) మిన్నకున్న కొలఁది సాహేబు మిన్నుమన్నుఁ గానకున్నాఁడు. ఇట్లనిచూచెద. (ప్రకాశ) యుద్ధము యుద్ధమనికలవరించుచున్నారు. వెన్కలంత మెల్లిదముగఁ జూడఁదగినవారుకారు సుఁడీ!

సీ॥ మాయాంసమర మేని ♦ మటుమాయ పఱపఁజా
లినయట్టి కలియుగా ♦ ర్జునులువారు
ప్రబల విపత్సరం ♦ పరల కేనియుఁ గొంకు
జంకెఱుంగని మహా ♦ శయులువారు
కార్యసాఫల్యంబు ♦ గల్గుదాఁక ను జట్టు
దల బాయకుండు ను ♦ త్తములువారు
ధర్మేతరంబౌ ప ♦ థం బవలంబింప
దొరకొనంబోని సా ♦ ధువులువారు
తే॥ గీ॥ కావున సులభసాధ్యులు ♦ కారు మీకుఁ
బోరుపో రనిసంతస ♦ పాటుపోరు
పద్మనాయకు లూర్జిత ♦ బాహుబలప
రాక్రమోదగ్ర విక్రమ ♦ ప్రఖ్యు లనఘ!

హైదరు—దేవా! ఈదమ్మన్నగారి బెదరింపులకు మొగమిచ్చకములకు నయగారములకు మోసపోవొదరు సుమా?

బూసి—మంత్రిసత్తమా! మోసపోవుటకు దమ్మనగారిమాటలయందుఁ గపటవృత్తి నాకుఁ గాన్పింపదు.

దమ్మ—బూసివరా! మాప్రత్యర్థులవలనధనలాభముఁ గాంచినవారికిఁ గాని నాకపటవృత్తి బోధపడదు.

హైదరు—ఏమనిరా పేలితివి? బూసిగారిసమక్షముగాన బ్రతికిపోయితివి. లేకున్న నీపాటికి నీకంఠము మత్కరవాలమున కాహుతిఁ గావింపఁబడి యుండెడిది.

దమ్మ—ఎదుటివారు చేతులు తెగియుండవలయునే గదా!

బూసి—మీ రిర్వురును శాంతింపుఁడు. దమ్మన్నగారూ! అవియన్నియు నట్లుంచుఁడు. ఇప్పటికేనియు మీ ప్రభువు మా దర్శనమునకు వచ్చి యుండిన నెంతచక్కఁగా నుండెడిది.

హైదరు—సెహబా సైన ప్రశ్న వేసితిరి.

దమ్మ—దేవా! కోట విడువుఁడని నిష్కారణముగఁ దమకంత తీవ్ర క్రోధముఁ గలిగించినవారి శత్రుగణమువలనఁ దమ సమక్షమున నేమి యాగౌరవము ప్రాప్తించునో యని సంశయించిరి గాని తమదర్శనము న్యూనతయని మానలేను. సెలవైన నప్పుడు కా దిప్పుడ పిలిపించెద. అనుజవివాహకార్యభంగమునకైనను వెనుదివియక రాఁగలరు.

హైదరు—వారు రానక్కఱలేదు. మేము చూడనక్కఱలేదు. ఈ క్షణము కోట విడువవలయును. బూసివరా! మన మొనర్చిన ప్రతిజ్ఞ నెఱవేఱితీఱవలయును. లేకున్నఁ బాళ్యాత్యపద్మనాయక సామ్రాజ్య సామంత ప్రభుత్వాధిక్య తారతమ్యంబులు వెల్లడికాఁజాలవు.

దమ్మ—సాహెబుగారూ! దివాణమువారు పట్టినకుందేటికిఁ గాళ్లు మూఁడేనా? బొబ్బిలి విడువవలయు నను పట్టుదల తమ కేటికి? కోటవిడిచినఁదమకుఁ గొనఁగూడు మహాభాగ్య మేమి!

హైదరు—ఏమి మహాభాగ్యమా? తురుష్కప్రతిష్ఠాసిద్ధ్యహంకారసంరక్షణము, విజయరామరాజ పట్టాభిషేకోత్సవంబును.

దమ్మ—(తనలో) అగ్రహాభిమానములారా! మీ గొంకంతెతిడవు నన్నాశ్రయింపకుఁడు. (ప్రకాశముగ) మంత్రిసత్తమా! కాకిన గొట్టి గ్రద్దకు వేయు నీరాజనీతి కర్థమేమి చెప్పఁ గొనవలయును?

హైదరు—అర్థమా! పద్మనాయక దుర్గగ్రహ ఫలితంబనియు, విజయరామాపనీనాథుని సముద్యోగ సంప్రాప్త సంపద్విశేషంబనియు.

దమ్మ—కాదు కాదు. అర్థారిత్వమే అర్థము.

హైదరు—అదరిపడకుము, చెడిపోకుము.

దమ్మ—(నిర్లక్ష్యముగ) ఇంతకే బెదరుదురా? మిము మించిన సాహేబులచే సెబాసనిపించుకొంటిమి. మీరేమిగాఁ దలఁచుచున్నారో గాని పద్మనాయకు లసాధారణప్రజ్ఞాధురీణులు. వారి సద్గుణాతిశయములు పొత్తుగా నెటుంగ లేకున్నారు. బొబ్బిలి యనఁగా మూర్తీభవించిన పౌరుషాగ్నియని తెలంపుఁడు. నా మాటల విశ్వసించి దూర మాలోచింపుఁడు మిగిలిన పిమ్మట. బశ్చాత్తాపపడి ప్రయోజన ముండదు.

సీ॥ ప్రాణాలుపోయిన ♦ మానవస్వాతంత్ర్య
మ్ములఁ గోలుపోవగాఁ ♦ దలఁపఁబోరు
సామంతు లనియెడి ♦ సాకుచే లోఁబడి
మీ శానిసీంగ్రముఁ ♦ మెలఁగఁబోరు
ప్రభుభక్తికిఁ వెన్కఁ ♦ బడకుగాని సిరంకు
శాధికారముక్రింద ♦ నడఁగఁబోరు
కడలేని కఠినశి ♦ క్షల బెదరించిన
మాతృదేశ ప్రేమ ♦ మానఁబోరు
తే॥ గీ॥ ఎరు, దూర మాలోచించి ♦ ప్రభులు మీరు
నా వచస్థితి మన్నించి ♦ న్యాయమెంచి
ధర్మపథ మవలంబించి ♦ తగవుమాన్చి
కార్యమును గారవించుట ♦ తగవు తమకు.

హైదరు—చాలుఁ జాలు. నీ వాక్కౌశలము నన్నుఁ బోర పెట్టఁజాలదు. నీ బెదరింపులకు మేము తల్లడిల్లము. నీ యుపన్యాసములతో మాకుఁ బనిలేదు.

బూసి—ఊటిక మీరేల వాగ్వాదమునకు దిగెదరు? వెలమరాయ బారిగారూ! సర్కారు వారికిని మీకును యుద్ధముతోఁ బని

యుండదు. మాకును మీకును సంధియే శుభప్రదము. తప్పులు చేసినను క్షమింపుమనుచున్నారు. అది లెస్సయైనమాట. మీరు బొబ్బిలికోట మాత్రము విడిచిపెట్టుఁడు. అంత కినుమడి రాఁబడిగల మఱియొకకోట నిప్పింపఁగలము. మాప్రతిజ్ఞా వాక్యములు చెల్లును. వృథాప్రజాక్షయము తప్పును. మీకుఁ గూడఁ గష్టములు మానును.

హైదరు—విధిగ విడిచి తీఱవలయును. విజయరామరాజు తదధీశుఁడు కాఁగలఁడు.

దమ్మ—ఖామవర్యా! తరతరంబులనుండి కాఁపురము చేయుస్థలము విడువుమనుట తమకు మాత్రము శ్రేయస్కరమా! అదియును గాక విజయనగరాధీశుఁడు తమకో సర్కారునకో కొంత ధనలాభముఁ గల్గించుటవలననే బొబ్బిలి యొసంగెద మనుచున్నారు. అట్లయిన,

తే॥గీ॥ కప్పమిప్పుడు చెల్లించి బ ♦ కాయితోడఁ
గోరినంత పైకంబుఁ జే ♦ కూర్చువాఁడ
నభిలషించినఁ ఔరంగరా ♦ యాధిపునకు
విజయనగర సామ్రాజ్యమ ♦ ర్పింపఁగలరె?

విజ—ఓరీ! ఏమిరా! నీవాక్పారుష్యవైఖరి! నిర్నిమిత్తమహాత్పరివాదశీలత్వము! మిగులు కూఁతలు రానీయకుము.

దమ్మ—ద్వాదశలక్షగూష్యంబు లొసంగి బొబ్బిలి నపేక్షించిన దుర్మార్గమునకంటె నావాక్పారుష్యము గర్హ్యమా? అంతర మెఱింగి ప్రసంగింపుము. నీ వాగాడంబరములు నన్ను వెఱపింపఁజాలవు. చచ్చినట్లు పడియుండుమూ.

బూసి—అకారణముగఁ గలహము నేలపెంచుకొనియెదరు? ఎప్పటికి విడువకున్నమానె. బొబ్బిలికోట వెలుపలఁ గొన్ని నిముసంబులు

పరివారకళత్రబంధుసహితంబుగ మీ పరిభవమొందినచో మఱల మీ రాజ్యము మీ కిప్పించెదను.

హైదరు—దేవా! అట్లుకాదు. కోటవిడిచి కానిక్రింతలకు లేచిపోవలసిన దని సెలవిండు.

విజ—సర్కారు కఠినముగా నుత్తరువు లీయవలయుఁ గాని నెత్తిన గుడ్డ వేసికొని లేచిపోయెదరు. సామంతుల నీరీతి బతిమాలుటయు నా మాత్రాజ్యగౌరవాతిశయములకు లోప మనియే నాతలంపు.

దమ్మ—ఔరా! తురుష్క క్షత్రియ దుర్మార్గములు మేరమీఱు చున్నవి! విజయరామరాజా! ఇంతమాత్రమునకె కోట విడిచి లేచిపోవుటకు మేము క్షత్రియులము కాము సుమా! పరాసు తురుష్కాధిపతులారా! ఆలకింపుఁడీ వినుఁడు,

శా॥ ప్రాణాలుండఁగఁ గోటనీడుట లసం ♦ బద్ధంబు ఫాలాక్షుఁడే
రాని మ్మాతనియబ్బతోఁ గలిసి, పో ♦ రాటంబునం దేను చా
వైనం జత్తుముగాని లోఁబడము న్యా ♦ యం బే జయంబీయుఁ డ్వ
త్సేనారణ్యము మాశరానలమె భ ♦ స్మీ భూతముం జేయుతన్!

విజ—కోటివట్టువుఁగాఁవుల కేమి? చేతలకుఁ గూఁతలకు బహుదూరము.

హైదరు—(హేళనగా) వెలమగొరల పైబింకములకు జంకువారము కాము. యుద్ధపద్ధతియే సిద్ధమైనఁగాని పస తేలదు. మూఁడవ పూఁటకు బొబ్బిలి గఢీపేరు మాపనేని నేను హైదరుజంగునే?

దమ్మ—సాహెబుగారూ! జాగ్రత్త! మాటలాడు నపు డొడలెఱుంగ వలయును.

మ॥ ప్రళయ ద్వాదశచండభాను లుదయిం ♦ పక లేద, అంభోనిధి
జ్వాలనోదగ్రహాలాహలంబు జనియిం ♦ పక లేద, కల్పాంతకో

జ్వాలగా రీశ నిరీక్షణాగ్ని ప్రసరింప♦ఁ లేద, మావీరబొ
బ్బిలి సంస్థానము రూపుమాపఁగల దో♦ ర్వీర్యంబు నీకబ్బునే?

బూసీగారూ! తమరు స్వతంత్రబుద్ధి విసిమోగి పర మంత్రుల సలహాలపై నాధారపడి న్యాయాన్యాయములఁ బరిష్కరింపలేక సామ్రాజ్యనైతికాదర్శ విరుద్ధప్రవర్తకులై శాశ్వతాపఖ్యాతికి లోనగుచున్నారు. సత్యాంశమున కీషణ్మాత్రమేని భేద మాపాదింపని నామాటలు పాటింపకున్నారు. పద్మనాయకులు నిరపరాధులని యాధారములఁ జూపితిని. సాపరాధులని మీరు శంకించినచో క్షమింపుఁడని కేల్మోడ్చితిని. బకాయితోఁ బాటు జరుగనున్న యేఁడుసంవత్సరముల కప్పమిప్పుడు చెల్లింతు నంటిని. ప్రభుత్వమువారికి ధనావసరము కలిగెనేని కోరినంత పైక మర్పింపఁగలమని మనవి చేసితిని. తమకు మాయెడఁగలిగిన యీ యనిమిత్తాగ్రహము మా క్షమాపణముతోఁ శాంతింపదేని విజయరామరాజునకు బొబ్బిలిఁ గట్టిపెట్టెద మాను పట్టుదలఁ గట్టిపెట్టి పరిపాలకుల యనుగ్రహము వచ్చుదనుకఁ గోట స్వాధీనముఁ జేసికొనుఁడు. మాకు సమ్మతమే యనుచున్నాము. ఇదియుఁ గాదందురా? మనమన శ్రేయోభిలాషులగు మధ్యవర్తుల యభిప్రాయముల ననుసరించి నడచుకొనుటకైన నంగీకరింపుఁడు. లేదా శక్తిసామర్థ్యములుగల సామంతునిమైత్రి సామ్రాజ్యప్రభుత్వమునకు క్షేమదాయకమగుటచే విజయరామరాజుం జేపట్టి వాని యభీష్టముఁ దీర్పఁదలంచితిరేని మధ్యవర్తులై నిలువఁబడుఁడు. విజయనగరమునకు, బొబ్బిలికిఁ బోరుఁగూర్పుఁడు. జయాపజయంబుఁబట్టి బలవంతునిఁ జేపట్టుఁడు. అది ధర్మము. ఎందులకు సమ్మతింపక తమరు సంకల్పించినవిధంబుననే యుద్ధము సిద్ధమందురా! నిర్నిమిత్త ప్రజాక్షయకారణముగనుక యుభయ పక్షముల నుత్తమయోధాగ్రేసరులయం దొక్కొక్కరి నేర్చి

తులారణంబుఁ గల్పింపుఁడు. వారియం దెవరోడిన వారిపక్షమున కపటయం బాపాదింపుఁడు. సమంజస మనిపించుకొనును. అట్లు గాక నా వాకొనిన విధంబులందుఁ దమ కొకటేనియు గిట్టక పోయిన నదియైన సెలవిండు. సెలవుఁ గైకొనియెదను. ఇంత కంటె నీవిషయమై నేను జెప్పవలసినదికూడ లేదు. తమరు వినవలసినదియు లేదు. మావిధ్యుక్తధర్మంబుల నిర్వర్తించితిమి. విధివ్రాత యెట్లున్న నట్లు జరుగఁగలదు. ప్రమాదమునఁ గాని యాగ్రహావేశుఁడనైగాని నేనేమేని మిగులు ప్రశంస గావించితినేని క్షమించి నన్నంపివేయుఁడు.

బూసి—(తనలో) పద్మనాయకులు బాహుబలపరాక్రమోపేతులు, శాంతస్వభావులు, మానవంతులు, నిర్దోషులు, దండనార్హులు కారు. నా బుద్ధిబలముంబట్టియేమి, వారి వాగ్వైఖరింబట్టియేమి కోట విడువుమనుట లన్యాయంబే. శిక్షింపకుండుటకు హైదరు జంగు లంచముగ్రహించి విజయరామునిపక్ష మవలంబించి నాఁడు. నేనుఁగూడఁ బొరపడి విజయరామునకు బొబ్బిలి యొసంగెదనని వాగ్దానము గావించితిని. బొబ్బిలిరాజ్యమునకు హాని రోయకుండుమన్నవో హైదరంగీకారములేని దే కార్యముఁగాని స్వతంత్రించి నిర్వర్తింపఁ దలదని నవాబాజ్ఞ. వెల్మ నొప్పింతమనిన శిక్షార్హులముకామని తెగించుచున్నారు. యుద్ధము తప్పనట్లేయున్నది. నాకుఁ గర్తవ్యము బోధపడకున్నది. (ప్రకాశముగ) దమ్మన్నగారూ! సామ్రాజ్యప్రభుత్వము వారికి మీరు లొంగిరనినను నపఖ్యాతిలేదు. మీయెడ నాకు జాలి కలుగుచున్నది. నేనెటులేని తంతరవ్యవహారముల సవరింతును. నిర్దోషుల శిక్షించిన దుర్యశము మాయదియే యగును. త్రుటి కాలము మాత్రము కోటవిడువుఁడు. మాప్రతిన నీటినపైన మీకోట తిరిగి మీకు స్వాధీనపఱుతుము.

ధర్మ—దేవా! నన్నేల వేధించెదరు? త్రుటికాదు. త్రుటిసహస్రాంశము కాదు. కోటవిడువము. తుదకు విడుతుమను మాటయైనను మా

నోట వెలువడదు. మఱియు నామాట మీరనరాదు, మేము వినరాదు.

కం. కోటను విడుఁడని యేటికిఁ
 జీటికి మాటికిఁ దమరిటు ♦ సెలవిచ్చుట మో
 మోటము విడి నుడివెద నా
 మాటలఁ గలలందుఁగూడ ♦ మఱువఁగవలయున్.

హైదరు—బూసిగారి మెత్తఁదనమునుందు మీ బిఱుకుపలుకులు సాగుచున్నవి.

బూసి—దమ్మన్నగారూ! నామాట నంగీకరింపనట్లేనా?

దమ్మ—బూసిదొరా! నా ప్రార్థనముఁ ద్రోసివేసినట్లేకదా?

హైదరు—ముమ్మాటికిఁగూడ.

దమ్మ—సాహెబుగారూ! నేను బూసిగారితో సంభాషించుచున్నాను.

హైదరు—ఎంతసేపులే, ఈబిగుమానము!

దమ్మ—మానాభిమాన సంరక్షణము కంఠగతప్రాణులమై యుండునంతవఱకు.

బూసి—దమ్మన్నగారూ! నాచెప్పినచొప్పు సమ్మతింపఁదగినది.

దమ్మ—రాజాజ్ఞలేదు. నామనముగూడ నియ్యకొనదు.

బూసి—అట్లయినఁ బోరాటమునకు సిద్ధపడెదరా?

దమ్మ—తమరే తప్పదనుచున్నారుగదా!

బూసి—అయ్యా! నేనింతకుమించి సహాయము సేయఁజాలను.

దమ్మ—దేవా! సంధి కియ్యకొనఁగూడదా!

విజ—వద్దనిన వన్నెచీరఁగట్టుకొని వచ్చెద నన్నట్లున్నది. కుదురదని యెన్నివేలసారులు చెప్పవలయునో?

హైదరు—ఆహా! మీకు మాకు రాజీకుదురదు. కోట ఖాలీచేయుక తప్పదు.

దమ్మ—అది స్వప్నవార్త! గగనప్రసూనము! శశవిషాణము!

హైదరు—అటులైనచో వీరబొబ్బిలి వెలమసైన్యము సంఘమరణము నకు సిద్ధపడవలసినదే.

దమ్మ—ఎవరు మరణమునకు సిద్ధపడవలసినది వేఱుమాట. జయాపజయములు దైవాధీనములు. సాహేబుగారూ! క్షత్రియులతోఁ గలిసి సంధివిఫల మెట్లు గావింపవలయునో చక్కఁగా నిర్వర్తించితిరి. ఇంతకన్న మాకింకేమికీడుఁ గావింపఁగలరు? యుద్ధము సేయించి మీరు రెండుచేతుల బావుకొనునది చూడకపోము. ఈకనులకీ తెప్పలు దూరము కావు. సంధివిఫలానంతరము ధర్మస్వరూపుఁడైన మాప్రభువు తమతో నీరీతి వచింపుమనినాఁడు. చెవియొగ్గుము.

సీ॥ అవసరంబేనిఁ జా ♦ నైనఁ జత్తురుగాని
వెల్మవీరులు కోట ♦ విడువరనుము
తినబోఁటి కోటి న ♦ ద్దారుల కేనియుఁ
బద్మనాయకులు దు ♦ ర్వారులనుము
మాటిమాటికిఁ బొల్లు ♦ మాటలు వెలువరిం
చినఁ బ్రాణమానముల్ ♦ చెల్లుననుము
విజయరామ నకు బొ ♦ బ్బిలి నీయఁబనిలేదు
చావుఁదప్పించినఁ ♦ జాలుననుము
తే॥ గీ॥ న్యాయమున వెనుదీయ ర ♦ న్యాయమునకుఁ
బొల్పడఁగఁబోరు బొబ్బిలి ♦ వారలనుము

ధర్మమేవజయతి గానఁ ♦ దప్పదనిన
యుద్ధమున కీక్షణము మేము ♦ సిద్ధమనుము.

బూసి—(తనలో) రావువారిసందేశము వారిసద్గుణంబులకు వన్నెఁ బెట్టఁదగినంత గాంభీర్యముతో నిండియున్నది.

హైదరు—దమ్మన్నా! నీయీ సందేశమునకుఁ బోరాటమున మాశతఘ్నులే ప్రత్యుత్తర మంపును. కొవ్వు తలకెక్కి మిన్నుమన్నరయక బొబ్బిలివాం డ్రిక్షుండలి దుమకయత్నించుచున్నారు

దమ్మ—(చిఱునగవుతో) సాహెబుగారూ! చావునకు రెండు చావులా? కల్పాంత మెదఁడేని యుట్టిఁగట్టుకొని యూఁగఁగలఁడా?

ఉ॥ మానుఁడు వైరముంచు బతి ♦ మాలితి లాభము లేకపోయె నే
మైనను భండనంబె తిర ♦ మంటిరి బొబ్బిలి వీరివెల్మ నే
నానివహ ప్రతాపకల ♦ నంబు, తురుష్కపరాసుయుద్ధవి
ద్యాసపుణప్రశస్తి వికి ♦ దంబగుఁ బోరఁగరంచు శాలివృల్!

విజ—(తనలో) రాయబారి వైపోయినావు. లేకున్న సీగతి నిదివఱకే హైదరుజంగుగారు తేల్చియుందురు.

దమ్మ—బూసిటొర్రగారూ! నాకు సెలవొసంగుఁడు. (సలాముచేయును)

బూసి—దమ్మన్నగారూ! పోయిరండు. (అని సలాముచేయును)

దమ్మ—సాహెబుగారూ! వెళ్లివచ్చెద. (సలాముచేయును)

హైదరు—పోవచ్చును. (నిర్లక్ష్యముగ సలాముచేయును)

దమ్మ—మంత్రిగారూ! నేఁడు పోవచ్చునన్నట్లుగాదు. ముందున్నది ముసళ్లపండుగు! పద్మనాయకులతోఁ బోరాటము తొందఁచూ కాముతో సయ్యాటము గనుకఁ గర్తవ్య మాలోచించుకొనుము.

సీ॥ వెలమ విద్వేషియై ♦ విజయరామావనీ
నాథుని చాడీలు ♦ నమ్మకయ్య
మీరుమాత్ర మెఱుంగ ♦ నేరరే సత్యంబు
రంగరావు నిరప ♦ రాధియయ్య
తమబోఁటి మంత్రిస ♦ త్తములె ధనాశకుం
బాల్పడు టెంతయుఁ ♦ బాపమయ్య
శరణంచు మేము మీ ♦ దరిఁ జేరితిమిగాన
రక్షణంబిడుటె క ♦ ర్తవ్యమయ్య
తే॥ గీ॥ పద్మనాయకు లాఖీల ♦ బాహుబలప
రాక్రమక్రమోదార ని ♦ ర్వక్రవిక్ర
మప్రధితులౌట మ్లేచ్ఛ సా ♦ మ్రాజ్యమునకు
సంధియే సర్వవిధముల ♦ సౌఖ్యకరము.

హైదరు—అధికప్రసంగము సేయక మెలఁకువతో మెలంగుము. పోపొమ్ము.

దమ్మ—సరే. (తలపంకించుచు నిష్క్రమించును.)

బూసి—ఎవఁడురా అక్కడ! దమ్మన్నగారిని సగౌరవంబుగ వారి ప్రోలి మేరవఱకు సాగనంపుమని వాసల్లీఖానునితో నేను చెప్పినట్లు చెప్పుము.

హైదరు—(తనలో) వాఁడనిన మాటలకు గా వనుగూడఁ జేయవలయునా!

విజ—(తనలో) ఇప్పటికి నాపీడ బాగుగా వదలినది. నాప్రయత్నఫలితము స్పష్టపడినది. ఇంక నెవ్వరు నాభాగ్యరేఖను దుడిచి వేయలేరు.

శా॥ కోటల్ పీడయి వెల్మవీరులు తుదన్ ♦ షట్కం హూరకోఁబోఁడు బా
హాటోపంబున విక్రమింపక రిపు ♦ ప్రాణాపహారంబు పో
రాటంబందునఁ గల్గు, నాకగు జయా ♦ రంభంబు లింకన్ సిరా
ఘాట వ్యాప్తి ఓడౌజ వైభవము ధీ ♦ కారంబుఁ గావించెదన్.

హైదరు—దేవా! సమరసన్నాహవిధులతోం దింక సప్రమత్తత వహింప వలయుఁగదా!

బూసి—మంత్రివరా! తగినంత కారణము లేకయే బొబ్బిలిపై బవరంబు నకుఁ గవియుటకు మనమియ్యకొనకున్నది. నిరపరాధులను దండించితిమను దుష్కీర్తి మన కాచంద్రార్కము నిలుచునని భయపడుచున్నాను. యుద్ధమాపి కప్పముఁగైకొని బొబ్బిలి వారిని మాటలచే మందలింపవలయునని తలంచుచున్నాను.

హైదరు—ఏమని సెలవిచ్చితిరి? సకలమాంద్రోళ మనుపేర సాటిసామంతులఁ గూడఁగట్టి సామ్రాజ్యప్రభుత్వనిరంకుశాధికారప్రభంజనమునకై కంకణముధరించి స్వాతంత్ర్య ప్రభుత్వ ప్రతిష్ఠా సంకల్పులైన పద్మనాయకులు నేఁడు మొగమిచ్చకము లాడినంతమాత్రమున నిరపరాధులా! ప్రబలాధార సహితంబుగ వెల్మగార్జన్యం బానాంతిము తమకడ వర్ణించిన నామాటలు తుద కసత్యంబులుగాఁ బరిణమింపఁబడెఁ గదా! ఆ బాల్యము నుండియుఁ బ్రభుత్వమువారి యోగక్షేమములు భయభక్తులతో విచారించుచుఁ బ్రభుభక్తి యుగ్గుబాలతోనేర్చిన నా హితోపదేశములు నిరర్థకంబులై పరిపంథి వచః ప్రచారంబులు సార్థకంబులై తమకు నమ్మకముఁ గూర్చెనా? పద్మనాయకుల ప్రభునిర్లక్ష్యస్వభావంబును రాజద్రోహసంకలితాంద్రోళ నాసక్తియు మాయోపాయధురంధరత్వంబును గన్నారఁ గాంచుచు మ్లేచ్ఛసామ్రాజ్యప్రభుత్వ ప్రతిష్ఠావినాశన హేతుభూతమైన యీసంధికే నెంతమాత్ర మంగీకరింపను. తమరెందులకైన సమర్థులు గనుక చిత్తమగురీతిఁ బరిష్కరింపుఁడు. నేను మాత్రమీగౌరవములేని మంత్రిపదవి వదలుకొనుచున్నాను. తాబేదారైనను నిజవర్తమానము వచించినపుడు నమ్మకుండిన నట్టి సర్దారుకొలువు నిష్ప్రయోజనమే కాక యపాయకరమందురు. కనుక నా కీక్షణంబున సెలవిండు. ఇదిగో! ప్రభుత్వముపా

రొసంగిన ముదిరిక, నవాబుగారిచేనొసంగఁబడిన మంత్రిపదవి చిహ్నంబులు సర్వమిప్పుడేతమ కర్పించెదను. నన్నంపివేయుఁడు. ఉద్యోగము విడువవలసి వచ్చినందులకై కాదు. ప్రభుత్వమున కింతమాత్రమునఁ బ్రబలవిపత్పరంపర సంభవించుననికాదు. కాని తరతరంబులనుండి నా వంశీయు లీయుద్యోగమున మాటఁ బడకుండఁ దమ ధర్మంబుల నిర్వర్తించి పేరుఁగాంచియుండ నేఁటి కీరితి నసత్యములని నా మాటలు నిరసింపఁబడినందులకై ప్రాణములపైఁ దీపికూడ నశించుచున్నది. కానిం డెట్లు కానున్న దట్లు జరుగును. నాకనుమతిఁ బ్రసాదింపుఁడు. (పోఁబోవును)

బూసి—(తనలో) ఏమిచేయఁగలను! ఇతఁ డెట్టివాఁడైనను వదలిపెట్టితినేని యీ దేశముపై బకాయి వసూ లగుమార్గము లేదు. నే నీ దేశమునకుఁ గ్రొత్త, నా కీదేశము క్రొత్త. తనపంతము నెగ్గ లేదనెడి యీర్ష్యచే విజయరామరాజు మొదలగు జమీందారులనెల్ల లోఁగొని ప్రభుత్వమువారిపైఁ దిరుగుపాటు చేయించినను జేయునదేమి? ప్రస్తుతము నాకడ సైనిక సంపత్తియుఁ జాలినంతలేదు. (తలపంకించుచు ప్రకాశముగ) కానిండు, మీరింత పట్టుదలతో నున్నప్పుడు నేనుమాత్ర మేమి చేయఁగలను! సమరసన్నాహ మొనర్పుఁడు. (అనినిష్క్రమించును)

విజ—(తనలో) బూసిగా రిపుడింగదా నాకడకుఁ బోలుపోసి పున్నమార్గించిరి!

హైదరు—విజయరామరాజా! చూచితివా? బూసిగారితోఁ బ్రతిఘటించి పని సేయుచున్నాను. ఎట్లయిన బొబ్బిలి నీకు సమకూర్చెద. ఆ విశ్వాసముమాత్ర ముంచవలయును.

విజ—(తనలో) ధనకాంక్షచే నీతురక యెట్టిబెట్టిదమున కేని యంగీకరించుచున్నాఁడు. (ప్రకాశముగ) బొబ్బిలిరాజ్యాభిషిక్తుఁడనే కావలయుఁగాని తమరే మాకులదైవముగ భావింపమా?

హైదరు—సెహబాస్! అట్లుండవలయును.

విజ—అట్లుండుటభాగ్యమా? ఒట్టిడుకొని చెప్పెద.

శా॥ దేవా! వీనులవిందుగా బొబ్బిలిమదో ♦ ద్రేకంబు మర్దించి వీ
రావేశంబున, నాకుఁ దత్ప్రబలరా ♦ జ్యప్రాప్తిఁ గల్పించినన్
దైవంబంచును బూజసేసెద భవ ♦ త్పాదంబులం గొల్తు నా
జీవంబుం జెడి యంతదాఁక ధనముం ♦ జేకూర్తు నెంతేనియున్.

హైదరు—వహ్వా! నీయాదార్యాతిశయంబునకు విశ్వాసప్రాబల్యము నకును జాల నానందించితిని. (అని వీపు మెప్పుదలతోఁ జఱచును.)

విజ—చెప్పుకొనఁ గూడదుగాని నా సంగతి మీకు ముందు ముందు గాని తెలియదు.

హైదరు—విజయరామరాజా! ఇట్టి సత్ప్రవర్తకుని, నిష్కళంకజాయమానకటాక్షుని బొబ్బిలిమూర్ఖు లెంత పీడించిరి!

విజ—వారెంత పీడించినను క్షమాగుణముచే నోర్చియే యుంటిని కాని యొదిగినకొలఁది నొక్కు మొదలిడుటఁబట్టి దివాణముతోడనే మనవిచేయవలసి వచ్చెను.

హైదరు—(తనలో) క్షమాగుణమా! చేతఁగానితనమా!

విజ—(తనలో) సాహెబును బాగుగా నుబ్బించినాను. నా కార్య సాఫల్యమున కేమియు లోపముండదు.

హైదరు—ఓ పాశ్చాత్య తురుష్క క్షత్రియ వాహినీ నాయకులారా! ప్రభుభక్తియుక్తులరై శరీరంబుల దాఁచుకొనక విరోధివరూధినిం జొరఁబాటి దారుణవైరిదారణోద్యద్వృత్తి సామ్రాజ్యభద్రసంధానులై సద్యశస్సంభరితాభిధానులుకాఁ బ్రయత్నిం

వుఁడు. రామరాజా! నీవు సంకల్పసిద్ధుఁడవు. నీ తలపెట్టిన కార్యము జరిగితీరును. నిర్భీతిగ నుండుము.

సీజ—నా వేగులవలనఁ దాండ్రపాపయ్య మేము రాజాముమార్గమున రాఁగలమని యాకోటకు గొంతసైన్యముతోఁ గాచుచున్నాఁడని వినుచున్నాను. ఇప్పుడు మా సైన్యము లామార్గమునఁగాక మఱియొక రహస్యమార్గమున బొబ్బిలిఁ జేర్చెద. పాపయ్య లేని బొబ్బిలి సులభసాధ్యము. ఒక్కఁడైన పిమ్మటఁ బాపయ్య దుర్జయుఁడుకాఁడు. దైవకారుణ్యంబున సర్వంబును జక్కఁబడినది. అన్నిటను గృతార్థుఁడను. కావలసిన దేదియు లేదు.

తే॥ వీరబొబ్బిలిరాజ్యంబు ♦ పేరుమాయు
విజయనగర సంస్థానంబు ♦ విస్తరిల్లు
మ్లేచ్ఛకరుణా సహాయ స ♦ మృద్ధిచేత
రామరాజు ప్రతిజ్ఞాబల ♦ ప్రాభవమున.

(అని నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.





శ్రీమత్పరదేవతాయై నమః



# బొబ్బిలి

(పద్మనాయక విజయము)

## తృతీయాంకము

రంగము—బొబ్బిలికోటలోని యంతఃపురము. శ్రీరాణీ మల్లమాదేవి ప్రవేశము.

మల్ల—ఓసీ! రామామణీ! రామామణీ!

రామా—అమ్మా! వచ్చుచున్నాను. (అనుచుఁ బ్రవేశించును)

మల్ల—వెళ్ళి కనుఁగొనివచ్చితివా?

రామా—దేవీ! యావద్వృత్తాంతము నరసివచ్చితిని.

మల్ల—అట్లయిన వినిపింపుము. తమ్మన్నగారి రాయబార మేమైనది?

రామా—అమ్మా! విఫలమే యైనది.

మల్ల—అది మన మనుకొనినదియే. బూసిగారేమనిరి? హైదరుజంగు సాహెబుగారి విషయమేమైనఁ గలదా?

రామా—అమ్మా! బూసిగారు మనపక్షమే ప్రసంగించిరఁటగాని హైదరుమాత్రము బొబ్బిలిపేరు వినిన మండిపడుచు సంధి విఫలకారి యయ్యెనఁట.

మల్ల—ఔను. అంగీకరింపఁడు.

సీ॥ పండ్రెండులక్షల ♦ పైకంబుదినియున్న
నైచ్యరాజాభిమా ♦ నంబుచేత
హైందవులం దనే ♦ కాంతఃకలహాకార
ఘండగు మ్లేచ్ఛాధ ♦ ముందు గనుక
భారతభూమి యై ♦ శ్వర్య సర్వస్వ సం
గ్రహణమే వైరిసం ♦ కల్పమగుట
భరతపుత్త్రుల బల ♦ ప్రాబల్య మేనాఁటి
కైనను దనకుపా ♦ యంబెగాన

తే॥ గీ॥ నేఁడు గోద్వేషి చేకూర ♦ నీఁడు సంధి
పద్మనాయకసముదగ్ర ♦ బాహువిక్ర
మప్రతాపాగ్ని హైబాత్రిజ్యం ♦ భణము స్వబల
నాశనం బొనరించెడు ♦ నాఁడెగాని.

రామా—దేవి! హైదరులోపమేమి! విదేశీయునకు మనపై నేమి కనికరము? వచ్చినంతవరకుఁ జేతిలో వేసికొనుటయే వాని పని. ఇంతకు మనకు సంఘీభావము తక్కువ. సమయమున కేదేశద్రోహియో చీలి యింటిగుట్టు బయటఁ బెట్టుచుండును. ఈసందు గ్రహించి ప్రతిరాజ్యమునకు మనదేశముపైననే చూపు! నల్లేరుపై బండిగానున్న దీ వ్యవహారము. జాతివైష మ్యఁబులు లేక యన్యోన్యకలహంబుల మఱచి భారతీయు లొక్కమాటపైన నిలిచిన మ్లేచ్ఛులు కాదు, వాఁడ్రు తాత లైనను హిందూదేశంబున నడుగిడఁగలరా? దేశమింత యైశ్వర్యవిహీనమై తహతహ వడునా? ఎన్నెన్నిమాఱులో దండువిడిచి విదేశీయప్రభువులు మనమాతృభూమిం గొల్లఁ గొని స్వదేశోద్ధరణముఁ గావించుకొనుచుండ మనవాండ్రి కాపాటి బుద్ధిలేదయ్యె.

మల్ల—చక్కఁగ వచించితివి. మనలో మన కంతఃకలహము లున్నను విజయరాముఁడు ఫరంగీల నేల మనపై నుసిఁగొల్ప వలయును? చెప్పుము. వాండ్రు తనను మాత్రము బాగు చేయుదురా? ఒక్కొక్క రాజ్యంబునకు వరుసగా నుద్వాసనఁ జెప్పిరే తీఱు దురు. నేఁడు తనతోఁ గలిసి మనపైకి వచ్చిరి. రేపు మఱియొక నితోఁ గలిసి తనపైకి రాఁగలరు. ఏమిలాభము! మొత్తము మీఁద మాతృద్రోహులగు దేశీయులచే భరతఖండము బాగుగ వంచింపఁబడుచున్నది.

సీ॥ క్షత్రియవికాంతి ♦ సంపద్విశేషంబు
వలనఁ జేకూరిన ♦ వైభవంబు
రెడ్డినాయకుల దో ♦ ర్వీర్య ప్రతాప సం
ప్రాప్తి నార్జించిన ♦ ప్రాభవంబు
మహరాష్ట్ర జేగీయ ♦ మానపరాక్రమ
వ్యాప్తిఁ గైవచ్మైన ♦ యతిశయంబు
వెలమవీరుల జగ ♦ ద్విఖ్యాత శౌర్య ప్ర
సక్తిలభించిన ♦ సద్యశంబు

తే॥ నాశమైపోవుచుండె ది ♦ న క్రమమున
మాతృదేశవిద్రోహ దు ♦ ర్మతులచేత
మిత్రభేదప్రకల్పిత ♦ మ్లేచ్ఛనీతి
భరతమాతా! లసత్ప్రీతి ♦ భాసమేత!

రామా—అమ్మా! వారికేమి పోఁగాలమోగాని హైదరెంతసేపు మాటలాడినను గోటవిడువు మనుట తప్ప వేఱొకటి లేనేలేదఁట.

మల్ల—రామామణీ! కండకావరమట్లే వేధింపించును. కోటవిడువు మనుటకు బొబ్బిలి తన యబ్బసొమ్మనియా! లేక తాతముల్లె యనియా!

రామా—తమరు సెలవిచ్చినట్లు దమ్మన్నగారనఁగా హైదరుజంగుకై మీయంతట మీరు వెడలిపోయిన సరే లేకున్న నీ ఋణము వెడలింతు నని దినంతులు గొట్టినాఁడఁట.

మల్లా—

సీ॥ బొబ్బిలిప్రాంతభూ ♦ ముల రుధిరప్రవా
హంబులు ప్రవహించు ♦ నంతదనుక
యవన పరాసు సై ♦ న్యంబులు నామమా
త్రావశిష్టంబులై ♦ పోవకుండఁ
బద్మనాయక వీర ♦ వర్య శాతాసిచేఁ
బరరాజు విదళింపఁ ♦ బడకముందె
కంఠగతాసువుఁ ♦ గల్గిఁ జీవత్కోర్కె
వెలమ శాబకమైన ♦ నిలిచెనేని

ఆ॥ వె॥ వీరబొబ్బిలిం బ్ర ♦ వేశింపఁ దనుమింగు
దొరలకైనఁగాని ♦ దుర్లభంబు
ప్రతిఘటింపఁ గలరు ♦ రాఘ్నకులీనులు
హరినైనఁ ద్రిపుర ♦ హరునినైన.

రామా—(తనలో) ఈ వీరపత్నిసంభాషణము నాకు మహిషాసుర వధా వృత్తాంతము జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. బళీ! పద్మనాయక వంశమా! నీవు పుట్టినతరువాతనే శూరత్వము పుట్టిన దనవచ్చును. అసూర్యంపశ్యలగు సీయమవచనంబులే శాత్రవ గర్వనిర్భేదప్రతిమానంబులైయుండ నింకఁ బద్మనాయక పురుషులవిషయమై చర్చింపవలయునా? దేశమాతృమతల్లీ! ఇట్టి వీరరసావతారమూర్తులఁ గనియున్నను నీవు పడరాని పాట్లుపడక తప్పనటులున్నది. కట్టా! ముందుముందు నీవింక నెట్టిచెట్టలకు లోనుగానుంటివో కదా! నీసంతానపు టదృష్ట రేఖ యెటులున్నదో!

మల్ల— అటుపైన నేమిజరిగినది?

రామా—అనంతరము కోటఁ దుత్రిటిసహాస్రాంశమైనను విడువనేర మని రూఢిగా సెలవిచ్చి బూసిగారిచే సగౌరవంబుగా వీడు కొలుపంబడి దమ్మన్నగారు బొబ్బిలికి విచ్చేసిరి.

మల్ల—అటులైన మనవా రిపు డేమిచేయఁదలచినారు?

రామా—పరసేన బొబ్బిలి పరిసరంబులనున్నదని విని యుద్ధమునకై సిద్ధపడుచున్నారు.

(తెరలోఁ గలకలము- దుందుభిధ్వానము)

మల్ల—(వినుట నభినయించి) రామామణీ! వినుచున్నావా? ప్రత్యర్థి హృదయస్థగిత ధైర్యకంచుకవినిర్భిన్నమాన ప్రతిభాసంయుత రణప్రకటనోద్వాంత భేరీధ్వానంబులును, జతుర్దశ భువనైక భయావహకారణభూత దివ్యశరసర్వ పూత్కారతీక్ష్ణ హాలాహాలసమేత ప్రచండకోదండ మౌర్వీటంకారంబులును, సర్వసుర గరుడోరగాద్యఖిల చేతనవ్రాత విస్మయప్రకల్పితానన్య సాధారణానన్య ప్రోత్సాహకలిత బొబ్బిలి వీరభటోద్యత్సింహ నాదంబులును, సమస్త పద్మనాయక సమావృతుండై శ్రీమద్రే చర్లాంచిత వంశపయఃపారావార రంగారాయ రాకానిశాకర చక్రవర్తి నిబద్ధదీక్షాకంకణుండై రణరంగయజ్ఞశాల కవతరించి నటులఁ జెప్పక చెప్పుచున్నవి. బళిరా! చేటీ! ఈదినమే సుదినము! ఏమనిన—

మ॥ ప్రతిపక్ష ప్రభునాశనంబయిన సా ♦ మ్రాజ్యానుభోగంబు త
ద్వ్యతిరేకంబె తటస్థమైనఁ బరసౌ ♦ ఖ్యప్రాప్తి సంధిల్లుఁ, బ
ద్ధతు లీ రెంటనునేదియైన రవిచం ♦ ద్రస్థాయియైనట్టి కీ
ర్తిచేకూరును బద్మనాయకుల కు ♦ ర్వీచక్రపర్యంతమై.

రామా—దేవీ! ఎందులకో బాబుగా రిటువచ్చుచున్నారు.

మల్ల—(పరుగునవచ్చి చినరంగారావును రెండుచేతులతో నెత్తుకొని ముద్దిడి తొడపైఁ జేర్చి)
ఏమిరా! నాయనా! పరుగెత్తికొని వచ్చుచున్నాఁడవు. అబ్బబ్బా ఏమిను ఱికి యిది? మట్టిలో నాడివచ్చితివా?

చిన—అమ్మా! నాకు మంచియుడుపు, మంచికోటు తొడగవు!

మల్ల—(నవ్వుచు) నీపరిశుభ్రమున కిప్పుడున్నవి చాలవా?

చిన—కాదే! మంచివికావలయును. (అని గునియుచున్నాఁడు)

మల్ల—రామామణీ! మంచిదుస్తులఁట తీసికొనిరమ్ము.
(రామామణి నిష్క్రమించి యొక జతఁదెచ్చును.)

చిన—ఇవికావే! ఇంకొకజత.

(రామామణి తిరిగివెళ్ళి యింకొకజతఁదెచ్చును.)

చిన—ఇంకను మంచివికావలె.

మల్ల—(నగుచు) అట్లైన నీవవెళ్ళిచూచి నీయిష్టమైనవియే తెచ్చికొనుము. రామామణీ! తీసికొని వెళ్ళు.

రామా—(చినరంగారావు నెత్తికొని) మట్టిలోఁ బొరలాడు నీపెద్ద దొరగారి కివి చాలక మంచిదుస్తులు గావలసివచ్చినవి. ఏబ్బో (అని బుగ్గలఁబొడుచుచును.)

చిన—తన్నెదను, మాటలాడకు! (చినరంగారావు, రామామణి! నిష్క్రమింతురు.)

మల్ల—ఈ కుఱ్ఱవానియభిప్రాయ మేమైయుండును?

(రామామణి, యుద్ధపుదుస్తులతోఁ జినరంగారావు ప్రవేశింతురు.)

రామా—దేవీ! ఈ యోధాగ్రేసరునకు యుద్ధపుదుస్తులు గావలసి వచ్చినవి. (అని నవ్వును)

చిన—అమ్మా! ఇవి తొడిగింపవు?

మల్ల—రామామణీ! తొడగవే. (అని నవ్వుచున్నది.)

చిన—(తొడిగించుకొని టోపీబెట్టుకొని) అమ్మా! నాచిన్నకత్తిఁ దెప్పింపుము.

మల్ల—(చిరునగవున) నీ కివియున్నియు నెందుకోయి?

చిన—కావలెను. తెప్పింపుమమ్మా!

మల్ల—రామామణీ! అతనికత్తి యందుకొనిరమ్ము.

చిన—(కత్తిఁదీసికొని, వేసికొనలేక తబ్బిబ్బగుచుండును.)

మల్ల—(కత్తియందుకొని) ధరించుటయె యెఱుఁగని నీకు ఖడ్గమెందులకురా? (అని తగిలించును.)

చిన—(పోఁబోవును.)

మల్ల—ఎక్కడకు? నాయనా! ఒక్కముద్దిమ్మా. (ముద్దుబెట్టుకొనును.)

చిన—నాన్నదగ్గరకు వెళ్ళనిమ్మా.

మల్ల—నాయన యిప్పుడెచ్చట నున్నారు?

చిన—బురుజుమీఁద.

మల్ల—ఏమి చేయుచున్నారు?

చిన—తుపాకులు గాల్చుచున్నారు.

మల్ల—అట్లయిన నీవేటికి?

చిన—నాచిన్న తుపాకితో నేను గూడఁ గాల్చెదను. నన్నుఁబోనిమ్మా. (పోఁబోవును.)

మల్ల—(ఆపుచుఁ దనలో) సెహబాస్! బాలకా! రావు కేసరికిశోర

మనిపించితివి. వీరపత్ని యనియె గాక ధీరమాతయని కూడ గర్వింపవలసి యున్నది. ఈ యర్భకుని మఱపింపలేని తండ్రిగారి దగ్గఱకుఁ బోయెదనని పోరుఁబెట్టును. ఇట్లు చేసెన. (ప్రకాశముగ) పోవుదువుగాని, నీవు ప్రతిదినము చదువుకొనుచున్నావా?

చిన—ఆఁ!

మల్ల—అట్లయిన నీవిన్నాళ్ళనుండి యేమి నేర్చితివి?

చిన—పంతులుగారు చెప్పిన వన్నియు వచ్చును.

మల్ల—నీ కేమేని యాటవిడుపుఁ బద్దెములు వచ్చునా?

చిన—వచ్చును.

మల్ల—ఏదీ చదువుము.

చిన—

తే॥ గీ॥ మాతృదేశాభివృద్ధికై ♦ మానవుండు
పాటుపడఁడేని జీవచ్ఛ ♦ వంబెసుండు
మానసంరక్షణాసక్తి ♦ మానసమున
వర్తిలక పోయిన ద్విపాద ♦ పశువె నరుఁడు॥

రామా—(తనలో) సద్గుణంబు లుగ్గుబాలతోఁ బోయుటనఁగ నిట్టిదే కదా! ఇంక నీబాలున కొకరు నేర్పవలసిన దేమికలదు? (మెప్పుఁదలతో) ఏమీ! మల్లమాదేవిగారి శిశుపోషణము! పద్మనాయకవిద్యాభ్యసనవిధి చక్కఁగ నున్నది. భారతభూమికి వీరమాత యను పేరు రావలయునేని యామె సంతానమె నిదర్శనములు కావలయును. దేశోద్ధారణ మిప్పు డాంధ్రయువతీమతల్లులచేతఁ గదా యున్నది!

మల్ల—నాయనా! ఈపద్యము నేనుగదా నీకుఁ జెప్పితిని? నీ పంతులు గారు బోధించినది చదువుము.

చిన—మఱచిపోతిని. నిజమే. ఆపద్యము నీవే చెప్పితివి. ఇంకొకటి చదువుదును.

తే॥ గీ॥ దోస మనక స్వదేశ వి ♦ ద్రోహులైన
యల్పమతుల శతఘ్నితోఁ ♦ గాల్పవలయు
బరులఁజేరి దేశీయ సో ♦ దరుల కెగ్గు
లోయు శిక్షలం దెగ ♦ వేయవలయు॥

రామా—ఈపద్యము విజయరామరాజు చర్యకు సరిపోవుచున్నది.

మల్ల—కుమారా! చక్కనిపద్యము నేర్చుకొంటివి. (చెక్కిలి నిమురుచున్నది.)

చిన—అమ్మాయి! నా కింకొక పద్యము వచ్చును.

మల్ల—ఏదీ? అదికూడఁ జదువుము.

చిన— తే॥ గీ॥ పూజసేయఁగోరిన శక్తి ♦ పూజ మేలు
జన్మ మభిలషించిన వర ♦ జన్మ బాగు
విద్య నేర్వనెంచిన ధను ♦ ర్విద్య లెస్స
భక్తులన్నిటిలో దేశ ♦ భక్తి ఘనము॥

ఇంతే! ఇఁక నాకు రావు. అమ్మా! నేను వెళ్లెదను. (పోఁబోవును)

మల్ల—నాయనా! పద్యము రాకున్నమానె. ఇటువచ్చి కూర్చుండుము. నీకు మంచితాయము బెట్టెదను. (అని యొడిలోఁ గూర్చుండఁజేయును.)

రామా—నాయనా! ఇఁక మీకుఁ బద్యములు రానేరావా? పంతులు గారినడిగి తెలిసికొనివచ్చెదను. (అని పోఁబోవ)

చిన—(నవ్వుచు) ఇం కొక్కటేవచ్చును. చదివెదను రా! రామామణీ! రా!

రామా—(నవ్వుచు) చదువుటఁ బ్రారంభింపుఁడు.

చిన— తే॥ గీ॥ శరణుఁగోరిన రిపునైనఁ ♦ జంపరాదు
తల్లిదండ్రులాజ్ఞల జవ ♦ దాఁటరాదు

చెనఁటితో సహవాసంబుఁ ♦ జేయరాదు
వ్రతులగౌరవంబుల మైలఁ ♦ బఱుపరాదు॥

ఇఁక నిజముగ రావు. ఒట్టు!

రామా—పంతులుగారి నడుగవచ్చునా?

చిన—ఓ! అడుగుపో!

రామా—ఇఁక రానట్లే నమ్మితిమి.

చిన—ఏదీ మంచిరాయము!

మల్ల—రామామణీ! నాయన కేమైన మంచిఫలాహారముఁ బెట్టుము. (అని చినరంగారావు నందిచ్చి) తన బండార మొసంగి దాముల నాడింపుమని యొప్పఁజెప్పిరమ్మా. (ప్రకాశముగ) నాయనా! పోయిరమ్మా. రామామణి తాయ మొసఁగును.

చిన—రామామణీ! ఎత్తుకో!

రామా—(నవ్వుచు) పాఱాడుచున్నారా? నడువలేరేమి? రండు. (అని యెత్తుకొని నిష్క్రమించును.)

మల్ల—ఆహా! ముక్కుపచ్చలారని తనయుల వచ్చియురాని ముద్దుసుద్దు లెట్టి దురంతమనోవ్యథలనేని యుపశమింపఁగలవు. పుత్త్రప్రసంగ సందర్భసంజనిత సంతోషపారవశ్యంబున భండన భారవ్యవహారమే మఱచితిని. ప్రబలశత్రు గర్వభంగ వృత్తాంతము నాకర్ణించువఱకుఁ జిత్తము తత్తరించుచునే యుండును. యవనక్షత్రియ పరాసుబలఁబులు కలిసి యొక్కసారి యెత్తివచ్చుటంజేసి సంగరఫలితాంశమునకై మనము వేగిర పడుచున్నది. కాని యీజలవచ్ఛత్రువులలో నేయొక్క సైన్యమైనను బొబ్బిలికి మంచినీళ్ళ ప్రాయమేకదా!

రామా—(ప్రవేశించి) అమ్మా! రణ మతిదారుణముగ నున్నయది. ఇంతవఱకుమాత్రము బొబ్బిలికోట చెక్కుచెదరలేదు. ఈ

క్షణమువఱకు వీరబొబ్బిలి యోధులలో నష్టములేదు. ఇప్పటి దనుక మనదే యొకచేయి మీఁదుగనున్నది.

మల్ల—(సంతోషమున) చేటీ! చల్లనివార్తఁ జెప్పితివి. పద్మనాయక పరిపూర్ణవిజయసంసిద్ధికై నేను దేవపూజాతత్పర నయ్యెద. భరతదేశోద్ధారకా! శ్రీరామప్రభుతిలకా! రక్షింపుము.

మ॥ పరిపంథిప్రబలప్రభంజనము ని ♦ ర్వర్తించి న్యాయైక త
త్పరసంవర్ధిత వెల్మవీరమహుఁడై ♦ శ్వర్యంబు రక్షించి దు
ష్కరసంగ్రామ భరానుసంగత జగ ♦ త్సంక్షోభ మార్గ మాన్ప ను
మ్మరవున్ భక్తిని సంస్మరింతు రఘురా ♦ మా! దీనమందారమా!

రామా—దేవీ! గోపాలకృష్ణానుగ్రహంబున గోద్వేషిసంహారకా ర్యము నిర్విఘ్నంబుగఁ గొనసాగి దేశము నిష్కంటకమైతీరును. తమరు సంశయింపఁ బనియుండదు.

మల్ల—సంశయ మేమున్నదే? ఎవరెవరి విధ్యుక్తధర్మములు వారు వారు నిర్వర్తించుకొనినఁ గదా ఎట్లు జరుగవలసినకార్యంబు లట్లు జరుగును! కనుక నాపూజావిధానము కూడ జరిగినది.

రామా—అగును. భర్తలకు సతులు సకలకార్యములయందు శక్తి వంచనము లేకుండ సాయపడుటయే ధర్మము. పతికీర్త్యపకీర్తులు సతిహస్తగతము లందురు.

మల్ల—అందుకు సందేహమా?

సీ॥ చంద్రమతీ మహా ♦ సాధ్వీమతల్లి జ
గత్పూతచారిత్రి ♦ కలనఁగాక
రాణీసంయుక్త ని ♦ ర్వక్ర పరాక్రమ
ప్రక్రియాశేముషీ ♦ ప్రభలఁగాక
పాంచాలదేశాధి ♦ మాన ప్రపూరిత
ప్రోత్సాహవైశేష్య ♦ మునఁ గాక

ఇందిరాదేవి విలో ♦ ౕకైక పతివ్రత వి
భ్రాజిత పతిభక్తి ♦ వలనఁగాక
తే॥ విశ్రుతములైన హరిశ్చంద్ర ♦ పృథ్వీరాయ
బాలచంద్ర గూప్సింహుల ♦ ప్రాభవములు
దశదిశలఁ నిండి రవిచంద్ర ♦ సాక్షముగ
త్రయి మెఱుంగక వర్ధిల్లఁ ♦ గలవె? చెపుమ.

దంపతులలో నొకరేటికిం దీసిన మఱియొకరు కోటికిందీయక యన్యోన్యమును జేదోడు వాదోడుగఁ జరించుచుండిన నినుమడించిన సద్యశంబె ఫలితంబు కాఁగలదు. మెఱపు మెఱవకున్నఁగాని, మేఘము లేకుండినఁగాని కుంభవృష్టి కాస్పదము లేదు.

రామా.—దేవీ! సత్యము సెలవిచ్చితిరి.

మల్ల—రామామణీ! యుద్ధవిశేషంబులు సాకల్యంబుగ వినిపించుటకుఁ దగినవా రెవరేనియున్న బాగుండును.

(చెలికాని వెంకయ్య ప్రవేశించుచు)

ఉ॥ నాతలపైన మోపె జన ♦ నాథుఁడు వెల్మనభూవధా మహా
పాతక దుష్క్రియాకలిత ♦ భారము నెట్టులు నిర్వహింతు దు
ర్నీతివిపరీత వర్తనము ♦ నీపను శాతకృపాణపాణి కీ
ర్తితర మార్గమందుఁ జరి ♦ యింపఁగ వెంకయచేత మెుప్పునే!

అక్కటా! తుచ్ఛక్షత్రియ ప్రయోగదుర్మంత్రి సమాలబ్ధ ఘోరసంగ్రామము నిర్నిమిత్తనిర్దోషిప్రజాక్షయకారణమె గాక వీర బొబ్బిలి పద్మనాయక కుటుంబ సమున్మూలన హేతుభూతంబుగూడ నగుచున్నదికదా! మాలదైవమా! తృణీకృత త్రిలోకేశ్వర వైభవయు, వసూర్యంపశ్యయు, రేచర్లగోత్ర శుక్తిముక్తాఫల రంగారాయ ధర్మపత్నియు సాధ్వీనికర తిలక స్వరూపిణియు నగు శ్రీరాణీ మల్లమాదేవి కేనియు బలవన్మరణముఁ దప్పింపలేకపోయితివా? కట్టా! నిన్న మొన్నటి

దాఁక సకలైశ్వర్య సంతానసంపద్విశేష సమావృతమగు బొబ్బిలికోట యీపూఁటకో యింకొకపూఁటకో శాకినీఢాకినీ ముఖభూతప్రేత పిశాచ గణ నివాసయోగ్య ప్రేతవనముగా మాఱిపోవలసినదేనా? ఏకాదశ సహస్రసల్ప విరోధివరూధినీ మహాంభోధి పద్మనాయక స్వల్పసైన్య ద్వీపంబును క్షణములో ముంచివేయఁగలను. ఇంకను జయాపేక్ష తగదు. నీవేగి నిఖిల వెలమనాయకి మానవతీ శిరోమణుల కంఠ నిర్యద్రుధిర ధారావాహినుల మన కోటశక్తిం దృప్తిపఱచి రమ్ము' అనియా ప్రళయ సమయోత్పాత నిర్ఘాత వ్రాత ప్రతిమాన గర్భ నిర్భేదనకర రంగారాయ క్షమావల్లభుని యాజ్ఞ! అయ్యో! రవిచంద్ర తారకాపఖ్యాతికారణ పద్మనాయక శిశు స్త్రీ వధాపాతక వహనము నకుఁ జెలికాని వెంకయ్యయే కానిపించెనా? హే స్వదేశ మాతృ మతల్లీ! వీరబొబ్బిలి పద్మనాయక మానవతీ మానసంరక్షణాసక్త మానసుండనగు నన్నుఁ దమచిత పాషాణకాఠిన్యప్రతిమానహృదయు వరప్రసాదుఁ గావింపుము. ఏతత్కార్య నిర్వహణానంత రోత్తరక్షణము మ్లేచ్ఛ పరాసువాహినీనాయక రక్తధారా కల్లోలినీసుస్నాతుఁ గావించి భవత్సంతుష్టి నెఱపెద. ఇప్పటికే తడసితి. (బిగ్గఱగా) ఎవరే!

రామా—అయ్యా! వచ్చితిని. (సమీపించును.)

చెలి—అమ్మాయి యేమి సేయుచున్నది? నేను వచ్చితినని తెల్పుము.

రామా—అయ్యా! దయచేయవచ్చును. (ముందునడుచుచు) దేవీ! చిన్నాయనగారు వచ్చుచున్నారు.

మల్ల—చిట్టయ్యా! నమస్కరించుచున్నదానను. ఆపీఠ మలంకరింపుఁడు. (నమస్కరించును.)

చెలి—సుమంగలీభవ!

మల్ల—చిట్టయ్యా! యుద్ధమెట్లు ప్రారంభింపఁ బడినదో, యింత దనుక రణరంగవిశేషము లేమియో సెలవియ్యఁ బ్రార్థింతును.

చెలి—అమ్మాయీ! దామెరదమ్మన్నగారి సంధిప్రయత్న విఫలానంతరము సంగ్రామము నిశ్చయమని తలంచి మనము నౌబత్తు మ్రోయించుచుండ నాధ్వని హైదరు విని హసనల్లీఖానునితో 'మేము వగ్గఱలో దిగియుండినను నౌబత్తు మ్రోయించుటకు రావువెలవఁడయ్యెఁగా! రంగారాయఁ డీగడియలో నౌబత్తు నాపి కోట విడువవలయు'నని వార్త పంపెను.

మల్ల—పద్మనాయకులు కోటవిడుచుట సాహేబు ప్రాణము విడవనిదే!

చెలి—అమ్మాయీ! అందులకు వెలమప్రభువైన భవదీయదివ్య మనఃకాసారవిహార రాజహంసయగు రంగారాయ రాణ్మణి యిట్లనియె:

తే॥ గీ॥ పాదుషామెచ్చి యిచ్చె నౌ ♦ బత్తు మాకు
దాని మ్రోయింపవలదనఁ ♦ డానెవండు
నేఁడువచ్చినదా? దొంగ ♦ వేడబమున
హైదరునకిట్టి తడఁబాటు ♦ లర్హమగునె?

మఱియుఁ గోటవిడుచుసందర్భమున హైదరుతో నీరీతినుడువుమనియెను.

మ॥ వలసల్ పోవుట కేను చేసితిమె దు ♦ ర్వ్యాపార మేమేని నీ
వలెఁ, గాణాచితలంబు బొబ్బిలి త్యజిం ♦ పంబోము విత్తంబుఁ గా
వలెనన్నంత యొసంగఁగాఁ గలము నీ ♦ పంతంబు నెగ్గించుకో
వలెనన్నం బొనరింపఁగాఁ దగు రణ ♦ ప్రారంభ యత్నంబులన్.

మల్ల—తదనంతర మేమి జరిగినది?

చెలి—అమ్మాయీ! అంతట హసనల్లీఖాను రణ ప్రారంభ యత్నము లొనర్చు కొందమాగాని మీ కులపాలికల యభిమానసంరక్షణా

విధ మిప్పుడే యాలోచించు కొనఁడని యొక కాఱుఁగూఁతం గూయు—

మల్ల—(తొందరతోఁ గోపముతో) ఏమేమీ! ముష్కర తురుష్క దుష్కర వ్యాసంగము! పద్మనాయక మానవతీ స్మరణార్హత తన కెక్కడ వచ్చినది?

మ॥ పరిపంథీశచమూసమూహ బలద ♦ ర్పప్రక్రియాటోప ని
ర్భరదోర్గర్వ విదారణ ప్రథిత ధై ♦ ర్యస్థైర్య సాధ్వీత్వ సం
భరితానూన గుణప్రభాకలిత వె ♦ ల్మ స్త్రీ సుశీలైక సం
హరణాసక్తు శిరంబు ద్రొల్లడె విభే ♦ దానేకభిన్నాంబులై.

భువనప్రపూజితద్యోధునీపవిత్రనిరాకరణపతివ్రతా తిలకంబులును ప్రచండభీషణకృపాణవిద్యాశేముషీధురంధరలును తృణీకృతప్రాణమానలును నగు పద్మనాయక మానినీముఖుల నిజాభిమానహరణాపరా దుశ్శీలురఁ యుత్తమాంగములు సమగ్రనిజదోఃప్రాండితీమండన ప్రకాశిత కోదండరణోద్వృత్తి వీరబొబ్బిలి కోటసింహద్వారమునఁ గట్టింపఁ గలమని తురక యెఱుంగ నట్లున్నాఁడు. ఓట్టముష్క! హుసనల్లీ ఖాను త్రాఁగుఁబోతుఁ గూఁతకు దొరవా రేమిప్రత్యుత్తర మొసంగిరి?

చెలి—అమ్మాయీ! ఆమాటపైఁ బ్రళయకాలకల్పానల్ప రుద్రక్షుద్ర నిర్నిద్ర సముగ్రరౌద్రరస ప్రతిమానోదగ్ర క్రోధాగ్ని వెడలంగ్రక్కు సభాసదులవారించి ప్రభువుగారు నీవనినయట్లే,

మ॥ అనలజ్వాలల సాటివచ్చు జగదే ♦ కానన్య సామాన్య పా
వనచారిత్రలు వైరిరాట్తిమిరభా ♦ స్వత్తుల్య దోర్వీర్య సం
జనితోద్రేకలు వెల్మసాధ్వులు మదాం ♦ ధత్వంబునన్ గన్నఁగా
నని మీపాలిటి మృత్యుదేవతలు గా ♦ నన్ మాట నిర్భీతియే.

రామా — రాయబారియైనంత మాత్రమున నోటి కెంతమాటవచ్చిన నంత మాట విడిచినందులకు మెచ్చిన కొట్టిరి.

మల్ల — అభిజాతుని నోటను గదా గౌరవవాక్యములు వెలువడును. పోనిండు. తదనంతరకథావిధాన మేమి?

చెలి — అనంతర మా ప్రసంగ మంతతో విరమించి హుసనల్లీఖాను సాముంబున ధర్మరాజాదులు ద్వాదశవర్షంబు లరణ్యవాసంబును నొకయే డజ్ఞాతవాసంబును జేయలేదా? శ్రీరామ చంద్రుం డడవులం బడరాని యిబ్బందులంబడలేదా? నలాదులు కాలకర్మంబునం గొన్నిదినంబులు కానలం గ్రుమ్మరలేదా? మీరైన వలసలేగిన నేమిప్రమాదము? కొలందిలో మీ రాజ్యము మీకు రాఁగలదు. నామాట మన్నింపుం డని యే మేమో శ్రీరంగనీతులునుడువఁబ్రభువుగారు సకారణంబుగ వానిని ఖండించి ప్రత్యుత్తరంబు లొసంగి సగౌరవంబుగ యవన దూతుని వీడ్కొలిపిరి. తరువాత నరనారాయణాది దేవా భేద్యపద్మశకట భేర్యాది వివిధానేక నూత్నవ్యూహనిర్మాణంబులతో బ్రహ్మాండభాండవిభేదనానూన మత్తమాతంగ తురంగ శతఘ్నికా వీరభటోదగ్ర బృంహిత హేషాసింహనాదంబులతోఁ బాశ్చాత్యతురుష్క క్షత్రియపద్మనాయక యుద్ధవిద్యాదాన్నత్య ప్రకటితామేయానేక శాతహేతివ్రాతసంఘట్టన జాయమానకర్ణకఠోరధ్వానములతోఁ బ్రారంభింపంబడి యుద్ధం బమితఘోరంబై, దుర్నిరీక్ష్యంబై జగత్సంక్షోభ ప్రమేయంబై మృత్యుదేవీస్వరూప సన్నిభంబై భువనైకానన్య సామాన్యయోగ్యంబై ప్రత్యర్థిమనోరథభగ్నకారణంబై వీర బొబ్బిలి పద్మనాయకాత్మగౌరవస్థాపన హేతుభూతంబైతనరారె.

మల్ల — చిట్టియ్యా! ఏమి యీప్రభుత్వమువారి యధర్మ సంగ్రామాది వ్యవహారములు!

సీ॥ మానాభిమాన వి ♦ హీనతనైన ధ
నార్జనమే ముఖ్య ♦ మనెడియూహ
ధర్మపథానువ ♦ ర్తనుఁడైన బలవంతు
వంచించి సాధించు ♦ వాంఛితంబు
పరమతద్వేషభా ♦ వప్రధానంబయి
ప్రబలుచున్నట్టి దు ♦ ర్మార్గవృత్తి
మానవస్వాతంత్ర్య ♦ మహిమాపహరణ క్రి
యాసక్తి మెలఁగు దు ♦ రాశయంబు
తే॥ గీ॥ పూను మ్లేచ్ఛసామ్రాజ్య ప్ర ♦ భుత్వతత్త్వ
మును విమర్శించి ఖండించు ♦ జనుఁడు లేఁడె?
ధర్మమున కెందు నిలువంగఁ ♦ దావులేదు
భరతమాతృక దురదృష్ట ♦ వశము చేత.

ఏమి కావింపఁగలము? కలికాలము! మనవలనఁ గాఁదగిన దేమియు లేదు. తరువాతివృత్తాంతము సెలవిండు.

కలి—(తనలో) బాగు! రాజకీయ పరతంత్రవిధానమా! బాగు! బలవత్ప్రత్యర్థి త్రయచమూవిలయాంభోధి యాత్మీయదుర్గవేలా తికప్రమణసన్నిహితంబైనను గలంగని భవదీయపారావార సన్నిభగభీరస్వాంతసంశోభిత పవిత్రచారిత్రము రేచర్లగోత్ర గౌరవద్విగుణీకరణకారణ మగుచున్నది. (ప్రకాశముగ) అమ్మాయీ! అట్లుభయ సైన్యంబులలో హరిసాహరి ఖడ్గాఖడ్గి ముష్టాముష్టి బాహాబాహి నాహవవీరక్రీడాపిహారోన్మత్తులై తనివిననక ముసల ముద్గర పరశు పట్టిస బాణబాణాసన భిండివాల శతఘ్నీకానేక వివిధాయుధ సహాయంబులఁ బిటికిక ండ లేక, పిక్కచెదరిపోకుండ, వెనుకంజ వేయక సమరవిజయాంగనా పరిగ్రహణారంభసంరంభులై దిక్కులుపిక్కటిల్లఁ గులగిరివాతం బులల్లాడ నాళాతటీథ ద్రిభంబులు విహ్వాలంబంద వియచ్చర సంతానము పిచ్చలింపఁ, గురుపాండవ ఘోరసంగ్రామమును

నిరాకరించుచు, భీషణరామరావణ మహాయుద్ధమును మఱపించుచు, దేవదానవదారుణ రణోల్లాసంబుఁ దలంపించుచుఁ, బ్రభుకార్యనిర్వహణాసక్త స్వాంతంబులతో నన్యోన్య మతద్వేషభావ సమ్మేళనములతోఁ బద్మనాయక మ్లేచ్ఛక్షత్రియ బలప్రాబల్య నిరూపణోత్సాహములతో శరీరబలఁబుల దాఁచుకొనక రుధిర ధారావాహినులఁ బ్రవహింపఁజేసెను.

మల్ల—చిన్నాయనా! తమబోటి యుత్తమ యోధాగ్రేసరులవలనఁ గదా నేఁటికి వీరబొబ్బిలి సార్థకాభిధానయాట సంభవించెను! ప్రబలప్రయత్నమునసైన సీతూరిస్వదేశసంస్థానాధిపతుల నింతయెల్లిదముగఁజూచు మ్లేచ్ఛసామ్రాజ్యమునకుగర్వభంగమాచరించి తీరవలయును. ఔను. చులుకనసేయురా? మనమర్యాద మనము కాపాడుకొన్నఁగదా నిలుచుట. ఈనాఁటి సామంత ప్రభుప్రవర్తనము హాస్యాస్పదము.

సీ॥ గౌరవప్రదమసి ♦ రాఁబోలు మ్లేచ్ఛ ము
తావలంబసమున ♦ కాసఁబూని
యొడిలోన వరహాల ♦ నొలికింతురని యేము
యధికారులపదంబు ♦ లాశ్రయించి
పరిపాలకులమాయ ♦ వాక్యఁబులన్నమ్మి
తగనిపన్నులకునై ♦ తలలుద్రిప్పి
మాతృదేశద్రోహ ♦ చేతస్కులై పర
సామ్రాజ్యభద్రంబు ♦ సంతరించి

తే॥ గీ॥ తరతరంబుల గౌరవ ♦ స్థాన మిప్పుడు
కోలుపోయిరి చేసేఁత ♦ కాలమహిమ
నింత కెవరి ప్రజ్ఞాబలం ♦ బేమిసాగు
ధాతనిర్మాణమున కనా ♦ ధ్యంబులేదు!

కాలచక్రంబాగక తిరుగుచుండును. అందుచ్చనీచదశలు కలుగుచునే యుండును. ప్రతిదేశం బెప్పుడో నైచ్యం బనుభవించియే యున్నది. ఇపుడు మనదేశము వంతు వచ్చినటులున్నది. చిట్టెయ్యా! తరువాత?

చెలి—(తనలో) ఆహా! మల్లమారాజ్ఞీశేముషీవైశేష్యంబును నిరుపమానమాతృదేశారాధనయు, నహిత ధైర్యచ్ఛేదన పరాక్రమంబును నాసేతుహిమాచల వ్యాపితాసదృశసాధ్వీత్వంబును దదితర స్త్రీజనాలభ్యములు. తల్లీ! పద్మనాయకవంశవిభూషణంబవై జగజ్జననిగాఁ బ్రకాశించుచున్నావు. (ప్రకాశముగ) అమ్మా! అట్టిరువాగుల వాహినీసమూహంబులు హెచ్చుతగ్గులు లేక తుల్యంబుగా జీవఁబులపైఁ దీపిమాని హోరాహోరిఁ బోరాడుచుండ శత్రుప్రాణవాయుభక్షణాసక్త దివ్యాయుధ దర్వీకరధారియై యపరరుద్రుండో యనునిఖిలవిరోధివరూధినీకవచ ప్రభేదనవజ్రాయుధప్రతిమాన నిశితఖడ్గద్వితీయుండై, ద్వితీయబలభేదియో యనఁ నద్వితీయబలప్రతాపస్థైర్యుఁడై, ప్రలంబఘ్నుఁడోయన భీకరగనాసమేతుఁడై వీరబొబ్బిలి పురవరుండు స్వయముగ సర్వసేనాధిపత్యము వహించి మగఁటిమిచేఁ జెలరేఁగి జయాపజయంబుల క్షణంబులో నిర్ణయించెదఁ జూడుఁడని మేఘనిర్ఘోష సామ్యసంభాషణంబుల మన సైన్యంబుల నొక్కుమ్మడిఁ బురికొల్పి విజృంభింప నెదిరి బలంబులు చెల్లాచెదరై ధైర్యంబుఁ బోనాడి చెట్టుకొక్కండై క్షుధార్తమగు హార్యక్షము నీక్షించిన హరిణాంగనలరీతి వెఱచి తిరిగిచూడక పాఱిపోవుటయు సమిద్రంగంబు పీనుంగుపెంటలై పొడఁగట్టెను. అంతఁ బద్మనాయక సైనికముఖమున నానందమును బ్రతివీరుల మొగంబునఁ జింతాభరంబును దాండవించెను.

మల్ల—ప్రాణనాథుని యసహాయశౌర్యప్రశంసచే నుల్లము ముప్పొంగి పారవశ్య మనుభవించుచున్నది. వెండియు నాకిపుడు—

తే॥ గీ॥ నరకుదోర్గర్వ మడఁప జ ♦ నార్దనుఁడు
ద్వాపరంబున సత్యతో ♦ డ్వడిన భంగి
రంగరాయకుమారపతి ♦ ప్రక్కనిలిచి
కయ్యమున రిపునొంచు సం ♦ కల్పమొదవె.

చెలి—(తనలో) ధన్యోస్మి! వీరపత్ని! ధన్యోస్మి! నీవాక్యంబులు చిరస్మరణీయంబులు. పద్మనాయకకులసముద్భవమైన నీశరీరము వీరరక్తపూరితమగుట నైసర్గికమే. పుట్టిన మెట్టిన గృహములనేగాక పద్మనాయకసద్వంశమునేగాక భారతీయ యువతీమతల్లులంగూడ నీ యద్వితీయపవిత్రచరిత్రముచేతఁ దలంపఁజేయుచున్నావు. (ప్రకాశముగా) అమ్మాయీ! అట్లు కలగుండువడిన మ్లేచ్ఛతతియా పరాసుదళంబుల హైదరుజంగును, విజయరామరాజును, బూసియుఁ బుడికొల్పఁ జెలియలికట్ట నతిక్రమించు ప్రళయాంభోధిలీల సర్వసైన్యంబులు మనలగ్గలఁ కెగఁబ్రాఁక మొదలిడ మనవారు చలింపక పాషాణంబుల దొర్లించియు దివ్యాశుగములు పఱపియు శతఘ్నులం ద్రేల్చియు నుడుకుటంబలికుండలమీఁదఁ బగులఁగొట్టియుఁ, బొంగులుక్రాఁగిన నూనెవానఁగురిపించియు, గదాఘాతంబు లొనర్చియు, బారుటీఁటెలఁ బడఁగ్రుమ్మియు, ఖడ్గప్రహారంబులఁ దుత్తునియలుగావించినను క్షయమెఱుంగక శత్రుసైన్యం బిసుకపాతరవలెఁ దఱుఁగకపోవుటయేగాక ఫరంగిఫిరంగీలవలన మనకోటకు దక్షిణపుదిక్కున ద్వారముఁ జేయఁగల్గిరి.

మల్ల—మనకోటయే కూలినదా?

చెలి—ఔను. తదనంతరము మట్టమధ్యాహ్నమగుటయు నుభయపక్ష సేనానాయకుల యనుమతులననుసరించి సైన్యంబులు యుద్ధమాపి విశ్రాంతిఁ గైకొనుచున్నారు. అప్పట్ల నన్నురాపించి శ్రీ రంగరాయప్రభువతంసుఁడు దీనాననుండై —

మల్ల—ఆఁ! ఆఁ! ఏమంటిరేమంటిరి? త్రిభువనైకశూరుఁడగు ప్రభువు వారికే దీనత్వమా?

చెలి—అమ్మా! చెప్పెదను వినుము. అట్లు నన్నుఁ జూచి 'వెంకయ్యగారూ! చూచితిరా? మనకోట దుస్స్థితికివచ్చినది. పద్మనాయకసైన్యంబు క్షీణించినది. ఓగోధు లెంతమంది నశించినను మనకంటె నధికసంఖ్యాకులే మిగిలిరి. మన కింక జయము స్వప్నవృత్తాంతము. రణసాధనములయందును బరిపంథులే పైచేయిగానుండిరి. మ్లేచ్ఛాధములే క్రూరులు. అందు హైదరు మన ప్రబలశత్రువైన విజయరామునిచేతి కీలుబొమ్మయైనాఁడు. గౌరవహాని లేకుండఁ జరించుటయే మన ప్రస్తుత కర్తవ్యము. కనుక నివేగి—, (సంశయించుచుఁ దనలో) అయ్యో! ఏమని పిమ్మటి వృత్తాంతము వినిపింపవలయును?

మల్ల—(సంతోషమున) చిట్టయ్యగారూ! సంశయింపఁబనిలేదు. ప్రభువుగారి భావ మిదివఱకే బోధపడినది. ప్రాణనాథుని సుధామధురోక్తుల నాశ్రవఃపేయంబులు చేయుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

చెలి—కదనసమాచారము సాంగముగా వినిపించి మల్లమాదేవికి ఖడ్గ మొసఁగిరమ్మని యాజ్ఞ. (ఖడ్గ మీయఁబోవ)

మల్ల—చిట్టయ్యా! నాకు వేఱుఖడ్గ మేటికి? స్వసంస్థానముపైకిఁ దుచ్ఛమ్లేచ్ఛాధము లెత్తివచ్చినపు డభిమాన సంరక్షణాధారంబును బ్రత్యర్థి సంహార సాధనంబును మాని పద్మనాయక మానినీమణి నిముసమేని మనఁ గలదా! (అని గుప్తపఱచిన కైజారు తీయుచున్నది)

చెలి—(తనలో) మేలు మానినీశిరోమణీ! మేలు! శక్త్యవతారమనఁదగు నీకుఁ బరాజ్ఞ లేకపోయినదిగాని ఖడ్గధారినివై రణ

తలఁబునఁ బ్రవేశించిన నిన్నుఁ దేఱిచూడఁగల యోధుఁడు ముజ్జగంబునఁ గలఁడే! ఇంతకును దినంబులు తప్పివచ్చినవి. ప్రతి ప్రాతఃకాలంబున నాదిదేవిగఁ బూజింపఁదగిన నిన్నుఁ జేసేతఁ గోల్పోవు చున్నాముకదా! ఈఘోరకృత్యముఁ జూడఁగల పాషాణ హృదయముఁ గూడ ధాత నిర్మింప నోపునే? (అని తలవంచుకొని దుఃఖించును.)

మల్ల—బాబయ్యా! దుఃఖమును దిగమ్రింగుఁడు. భవత్పుత్రికా తుల్య నగు నేను నాథునిచే నుచితకార్యమునకే నియోగింపఁబడితిని. మరణంబునకై పరితపింపనుగాని అర్థాగినైనందులకు,

శా॥ విల్లున్ భల్లముఁ గేలఁ గీల్కొలిపి దో ♦ ర్వీర్యోద్భవోదగ్రశౌ
ర్యోల్లాసంబున రేఁగి దారుణ రణో ♦ ద్యోగ ప్రభావంబునన్
జెల్లాటం జెదరై రిపుప్రతతి గా ♦ సిం గూల సాహాయ్య సం
పల్లాభంబున జీవితేశ్వరుని దే ♦ ర్పన్ నీలుఁ గోల్పోయితిన్.

అని మాత్రము చింతించు చుంటిని.

చెలి—(తనలో) అయ్యయ్యో! అనన్య సామాన్యములగు నీపవిత్ర భావంబులకు సంతసింతునా! నీకుఁ గల్గఁబోవు పరమ దుఃస్థితికై సంతాపింతునా! ఛీ! ఛీ, వెంకయ్యా! కటికివానికిఁ గూడ దుష్కరమగు కార్యముం దలపెట్టితివి. శత్రువ్యూహంబులఁ జొరఁబాఱి వైరివిదారణమొ స్వకీయ మరణమో మగతనముగాని శిశుస్త్రీవధ మహాపాతకముగదా! మొత్తమునకు నాయట్టి నీచాతినీచకఠోరకర్ముఁడు, స్వకులశిశుస్త్రీ సంతాన విధ్వంసనోపాయ నిపుణుఁడు, ఘోర రాక్షస నైతికాదర్శప్రాయానూన మానసుఁడు, కృత త్రేతా ద్వాపర కలియుగంబులఁ బుట్టియుండఁడు. ఇఁక ముందును బుట్టఁబోఁడు. ఏమేమీ? మహాపురుషుఁడైన గోపాలకృష్ణరంగారాయాధిపనియోజితకార్యము పాపభూయిష్ట

మని తెగనాడితినిగా! పొరపాటు. ప్రభునియాజ్ఞ. దీననేను దూష్యుండనుగాను.

మల్ల—(ఆలోచన మభినయించుచు) సరియే. రామామణీ! నేను మరణమునకు సర్వసిద్ధముగ నున్నాను. నాపరలోక ప్రయాణమునకు ముందు కుమారుడగు చినరంగారాయుని రక్షించు భారము నీపై నుంచవలయునని యూహించుచున్నాను. నీకంటె నాకు నమ్మిన దాసీగణము లేదుగదా?

రామా—అమ్మా! దేవియాజ్ఞ కెదురాడరాదుగాని స్వామికార్యములు చేయవలసినకార్యంబున నేలనియోగింతురు? సంవత్సరముల కొలంది భక్తిశ్రద్ధలతో మీచెంతనేర్చిన ధనుర్విద్యాయాసమయమున నక్కఱకుమాలిన నావలన బొబ్బిలికెన్నఁడేమి ప్రయోజనమురాఁగలదు? నేను యుద్ధభూమికిఁబోవ నను మతింపవలయును.

మల్ల—సెహబాసు రామామణీ! రేచర్లగోత్రీయుల దాసీజనంబులకీపాటి సాహసముండఁదగినదే. నాపరిచారికా గణంబున నిట్టియుత్తమురాండ్రు కలరని తెలిసికొనుట కెంతేయు సంతసింతును. నీయిచ్ఛచొప్పుననే వర్తింపుము. (బిగ్గరగా) వేంకటలక్ష్మి! బాబుతో నీవొకసారి యిటురమ్మా.

చెలి—(తనలో) మల్లమాదేవి తన పరిచారికలను ధనుర్విద్యయందుఁగూడఁ బ్రవీణురాండ్రఁ జేసినదా? (ముక్కుపై వ్రేలుంచుకొనును)

(వేంకటలక్ష్మి చినరంగారావుతోఁ బ్రవేశించుచున్నది)

వేంక—అమ్మా! సెలవైనది.

చిన—అమ్మా! నన్నెందుకు పిలిపించితివి? నే నాడుకొనవలయును. పోయిరానిమ్మా.

మల్ల—(తనలో) అక్కటా! కుఱ్ఱవాని యసహాయస్థితిఁజూడ ధైర్యము చలించుచున్నది. (ప్రకాశముగ) నాయనా! రమ్ము. (ఎత్తికొని ముద్దాడి) వెంకటలక్ష్మమ్మ! వీరబొబ్బిలి పద్మనాయక మానినీ సంతానమునకు జోహారు గావింపవలసిన సమయమయ్యెనని వినియేయుందువు. కనుక యజమానిని సంకల్పముల నిర్వర్తించుట సేవకి కర్తవ్యము.

సీ॥ తల్లిదండ్రుల మమ్ముఁ ♦ దర్పణోదకములఁ
బరమందు సంతుష్టి ♦ పఱచుకొఱకు
ముందు నిర్వంశమై ♦ పోకుండ వీరబొ
బ్బిలి రావువంశంబు ♦ నిలుచుకొఱకు
ఇంత దురాగత ♦ వృత్తివర్తించిన
రిపుదుర్మదంబు ని ♦ ర్జించుకొఱకు
పూర్వార్జితఁబొంచుఁ ♦ బోలుపొందు నాత్మీయ
సింహాసనం బధి ♦ ష్ఠించుకొఱకు
తే॥ గీ॥ ఎంతకాలమో మా మ్మాశ్రీ ♦ యుంచుకొన్న . .
సేవకుల మిమ్ము మిమ్ముఁ బో ♦ షించుకొఱకు
శాత్రవులచేత నీరావు ♦ శాబకంబు
కీడుపొందకుండఁగ బ్రోతి ♦ కింపవలయు.

(అని యొప్పగించును.)

వేంక—దేవియాజ్ఞ శిరసావహించుచున్నాను. (చినరంగారాయునిఁ గైకొని) నాశక్తిసామర్థ్యములవలనఁ గాకపోయినను గొఱంతలేని భవదీయాపరితిమాన పతివ్రతాధర్మమే యీకుఱ్ఱవానిని సురక్షితుఁ జేయఁగలదను దృఢవిశ్వాసముననే యీమహాకార్య భారము వహింప సాహసించుచున్నాను.

మల్ల—దాదీ! ఇప్పటి స్థితినిబట్టి నీసామర్థ్యముగాని నాధర్మముగాని చిరంజీవిని రక్షింపఁజాలవుసుమా! దైవయత్నముఁగొనసాగిన

సాగవలయును. కాని మెట్లు కానున్న దట్లు కాఁగలదు.
(పుత్త్రుని నెత్తిపై నాశీఃపూర్వకముగఁ జేయిమెత్తి)

సీ॥ వైరిదుర్వార దో ♦ ర్బలయుతుండుగ ధను
ర్విద్యయందారితే ♦ రెదవుగాక
శాత్రవానీకంబు ♦ సంహరించి జననీ
జనకఋణవిముక్తిఁ ♦ గనెదుగాక
దేశ సేవానిర ♦ తి భరతమాతృక
సిరుల సముద్ధరిం ♦ చెదవుగాక
పేరు ప్రతిష్ఠలఁ ♦ బొంది పూర్వుల
లీల సామ్రాజ్య మే ♦ లెదవు గాక

తే॥ గీ॥ పెరిగి పెద్దవై వైభవో ♦ పేతుఁడవయి
యాయు చిరకాలజీవి వ ♦ య్యెదవుగాక
ఆదిదేవు దివ్యానుగ్ర ♦ హంబువలన
మల్లమాంబ పతివ్రతా ♦ మహిమకలన.

• దాదీ! ఇంక నీవు తడయరాదు.

వేంక—(కుమారుని దీసికొని) అక్కటా! దైవయత్నమున మానవ సంకల్పము లెంతలో వికల్పములగుచున్నవి. అమ్మా! నా కనుజ్ఞనిత్తురా? (నమస్కరించును.)

మల్ల—శుభంబగుఁగాక! పోయిరమ్ము. నాయనా! దాదితో వెళ్ళుము. (దాది కుమారునితోఁ బోఁబోవ) దాదీ! జాగ్రత్తసుమా! చిట్టయ్యా! మీ తనయ యాయుఃపూర్తి దాపైనది. ఈ నా తుదిమాట సంగ్రామతలంబున నున్న మనదళంబునకు సెల వీయవలయును.

ఉ॥ ప్రాణముపైని దీపి ప్రతి ♦ వారికి నైజము, రాజభక్తిపా
రీణత నూఁతగాఁగొని య ♦ రీణ సుఖప్రదమైన వీరని

ర్యాణపదంబుఁ జేకొనఁ బ్రి ♦ యత్నమొనర్పుఁడు మ్లేచ్ఛసైనిక
శ్రేణివిదల్పుఁ డూర్జితవి ♦ శిష్టభుజప్రభఁ బద్మనాయకుల్!

అడుగమఱచితి. రాజాముకోటనుండి పాపయ్య అన్నగారు రావింపఁబడిరా!

చెలి—అమ్మాయీ! విజయరాముఁడు పైరుల దేవులపల్లిమార్గంబున దీసికొనివచ్చెననియు, నీరాక యావసరమనియు యోగ్యులగు చారులచే వర్తమాన మంపితిమి. కాని యరాతిప్రతిబంధకము వారికిఁ దప్పక ప్రాప్తించునని యూహించుచున్నాము.

మల్ల—పోనిందు. ఆయన యిప్పట్టున రాకుండుటయు నొకవిధమున మేలే యగును. ఏమన, నీనాఁటి సంకులసమరంబున నెటుపోయి యెటువచ్చినను సమయంబు వేచి పాపయ్య అన్నగారు విజయ రాముని దుర్మద మడంపఁగలరని నాహృదయము దృఢముగ నమ్ముచున్నది. సాధారణముగ నాచిత్తము వృథాశల కెడ మీయదు. ఆయన యుద్ధమునకుఁ బైగాపుగనుండుట శ్రేయమే యైనదని తలంచుచున్నాను.

చెలి—నీయట్టి సాధ్వీమణి హృదయంబు రిత్తకోర్కులఁ గోరునా? అవశ్యము నీయుద్దేశము కొనసాగితీరునవియే నేను నమ్ము చున్నాను.

మల్ల—చిట్టెయ్యా! తమరువచ్చిన పని కిప్పటికే కాలాతీతమైనది. వేగి రించెదను. ఈనామాటలుమాత్రము విభునికి వినిపింపవలయును.

సీ॥ తనుయానను త్తమాం ♦ గము పైన నిల్పి ని
శ్చింతతోఁ దనువుఁ ద్య ♦ జింతునను ము
మల్లమాదేవిప్ర ♦ మాదంబు లేమేని
కలఁనేని కరుణింప ♦ వలయునను ము

భార్యా వియోగ సం ♦ ప్రాప్తిచే నిస్పృహా
స్వాంతులై వర్తింప ♦ వలవదనుము
నా యదృష్టంబె ట్టి ♦ న్ననిదైన నేజన్మ
కేనియుఁ దననే గ్రి ♦ హింతుననుము
తే. గీ. ప్రాణవిభుని యీడిగమున ♦ కంత్యదినమె
కాన నిదియు నాతుది నము ♦ స్కారమనుము
విజయరాము వధాకథా ♦ విధుల నేను
స్వర్గమందేనియున్ విన ♦ వలతుననుము.

రామా—(తనలో) నే నిచటి ఘోరకృత్యములు కనులఁ బడక మున్నె కర్ణకఠోరవార్తలు శ్రవఃకుహరంబుల బ్రవేశింపక మున్నె ఖడ్గపాణినై రణశిలఁబున కులుకుటయే యుత్తమము. (వడిగ నిష్క్రమించుచున్నది.)

చెలి—(తనలో) చివటికి పాపకర్మంబు వీక్షించుటకు నేనొక్కండను మిగిలితినా! దైవసంఘటనము! ఎంతటిలో నెన్ని వైపరీత్యములు కలుగనున్నవి! కట్టా! కర్తవ్య మూహింపఁజాలకున్నాను.

మల్ల—చిట్టయ్యా! సర్వమును జక్కఁబెట్టఁబడినది. నాకు సెలవిమ్ము. ఇట్లగుఁ గాక!

ఆ॥ వె॥ ధర్మపక్షపాతి ♦ దైవంబు గలఁడేని
వెలమజాతి గోష ♦ కలితమేని
నిర్నిమిత్తసమర ♦ నిర్వాహక ఫలంబు
విజయరాముఁ డనుభ ♦ వించుఁగాక!

(అని కత్తి యెత్తుచున్నది.)

చెలి—(నిర్విణ్ణుఁడై) తల్లీ! వలదు! వలదు! ఉడుగు ముడుగుము! (కత్తిఁ బట్టుకొనఁబోవును.)

మల్ల—జీవితేశ్వరా! (అని పొడుచుకొని ప్రాణము విడుచును.)

చెలి—హా! హతోస్మి! (అనిమూర్ఛిల్లును.)

(మల్లమ్మదేవి శవమునకును, చెలికాని వెంకయ్య గారికిని మధ్య తెరవ్రాలును.)"

చెలి—(సేదఁదేఱి) కటకటా! "పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః" అనులోకోక్తి సారవంతమయ్యెనుగదా! పిపీలికాది జిహ్మ పర్యంతమువ్యాపించి బ్రహ్మాండభాండమునయుక్తాయుక్తగరిమఁ బాలించుచున్నదను భగవత్స్వరూపముతధ్యమా! మిధ్యయా? రుద్రాక్షుడగ్ని నిర్ణిదగ్ధప్రళయాలోకనవహ్నికీలలు వ్యాపింపక మున్నె మల్లమారాజ్ఞియంతటి త్రిభువనైకానన్యసాధారణ పవిత్రచారిత్ర మానభంగ భయోద్రేక మానసయై యాత్మ హత్యకుఁ బాల్పడవలసివచ్చెనే! కలికాలమా! నీప్రభావ మవిచ్ఛి న్నముగసాగుచున్నది. ధర్మమునకు జయము లేదు. అధర్మమునకే కాలము. న్యాయముతోఁ బనియుండదు. బలవంతునిదే పలుకు బడి. ఇఁకఁ బాపమే ప్రపంచమును బరిపాలించును. మల్లమా దేవియను దివ్యగుణభూషణంబును గోల్పోయిన భరతమాత దురదృష్ట మింకను నెట్లుపరిణమించునో! న్యాయైక తత్పరుల యకాలమృత్యువుఁ దప్పింపనేరని రవిచంద్రతారకాదిగ్రహంబు లతేజంబుకాల్పనా? దుష్టశిక్షణ శిష్టరక్షణముల వర్తించు సుదర్శన మీయవసరమునకక్కఱకు రాకపోయిన నుండిననేమి? యుండిననేమి? వాతాతపవర్షంబుల సహించి పవనపర్ణాంబుభక్షులై చేసిన మౌనిజనుల దివ్యతపఃప్రభావం బిప్పుడు కాకున్న మఱియెప్పుడు జగదుపకారకారణ మగునో? అయ్యయ్యా! ఇట్టి యధర్మకార్యారంభుఁడనగు నన్ను మిన్నుమన్నేకమై నలి మివేయక మానెనా? చట్రాతిపైఁ గొట్టఁబడిన ఘటమువోలె నా శిరంబు సహస్రానేకభిన్నంబులై వ్రల్లకపోయెనే? పద్మనా యక దోర్వీర్యప్రతాపప్రకల్పిత శాశ్వతసద్యశంబుతోఁ బాటు చెలికాని వెంకయ్యగారి శిశుస్త్రీవధామహాపాతక

దుష్క్రియాకలితాపఖ్యాతియు స్థిరస్థాయి యగును గాఁ
బోలును? అహింసాపరమోధర్మయను నీతివాక్య ముఁగ్గుఁబాలతో
నేర్చిన పద్మనాయక సద్వంశసంభూతుఁడనగు నే నిట్టిఘోర
కృత్య మొనర్చి కాకివలె వేయేండ్లు జీవించుటకంటె మత్కంఠ
మీకరవాలంబున కెఱఁగావించిపరలోకప్రాప్తినందు టత్యుత్త
మము. (నఱకికొనఁబోవును) ప్రమాదము! బొబ్బిలిప్రభుని
యధీనమందున్న యీదేహముపై నాకెక్కడి యధికారము?
అస్వతంత్రుఁడను గనుక గోపాలకృష్ణ రంగరాయానుమతి
ననుసరించి హతశేషమగు పద్మనాయక మానినీ సంతానమును
పరలోకప్రయాణోన్ముఖముఁ గావించెదఁగాక! కట్టా! చేసేత
నిట్టి యకార్యకరణమున కెట్లుపక్రమించెద? ఆహా! చేయక
తప్పదు. పుత్రులనక, కళత్రములనక, యాప్తులనక, మిత్రు
లనక యొకసారి యీ కటికి కార్యము నిర్వహింపఁగలనా?
(ఆలోచించి) నిర్వహింపలే కేమి? గుడిమ్రింగు వానికి లింగ మెంత?
ఛీట్లగుఁగాక! వెల్మశిశుస్త్రీ సంతానమును గృహంబుల
బంధించి చిచ్చుముట్టించి వెడలిపోయెదఁగాక! ఇదియే సమంజస
ము. (పరిక్రమించుచున్నాఁడు) (లోగిళ్ళు కానిపించును. గొళ్ళె
ములఁదగిల్చి సంశయించుచు) ఓదక్షిణహస్తమా! చలింప
కుము. జగజ్జననియైన చక్రవర్తిని కరమునకే యాత్మహత్య
గావించుకొనుమని కరవాలమందింప సాహసించిన నీ పురుషోత్తమ
వంశసంజాతుఁడనైన పరమచండాల కృత్యముల కొడిగట్టిన నన్
దునుమ సంశయించిన నీవు ఇక్కార్యంబునకుఁగూడ నసమర్థ
రాలవే. కనుక నుపక్రమింపుము. (చిచ్చు ముట్టించి) సెహ
బాస్! కృతకృత్యుఁడనైతిని. నరవరాజ్ఞ నిర్వర్తించితిని.
పుణ్యమో! పాపమో! స్వర్గమో! నరకమో! ప్రాప్తించుఁగాక
సంతోషప్రదమే!

శా. రౌద్రిస్ఫూర్తిని విక్రమించెద బల ♦ ప్రాగల్భ్యసంయోగ ని
ర్ణిద్రోజ్జ్వల పద్మనాయక ధను ♦ ర్విద్యాప్రభావ ప్రతా
పోద్రేకంబున శక్తివంచనము లే ♦ కుండన్ విజృంభించి యా
క్షుద్రప్రాభవ మేర్పడంగ రిపుసం ♦ క్షోభంబుఁ గల్పించెదన్॥

(అని విచ్చుకత్తితోఁ బరుగిడుచు నిష్క్రమించుచున్నాఁడు.)

(ఇది తృతీయాంకము.)





శ్రీమత్పరదేవతాయై నమః

# బొబ్బిలి

(పద్మనాయక విజయము)



## చతుర్థాంకము

(రంగము — బొబ్బిలికోట ముందుభాగము. శతఘ్నీనాదంబులు. కోటగోడ విరిగి పడుచుండుట చూపట్టును.)

(నేపథ్యమున)

రంగారావు — విపక్షచమూసమూహములారా! ఇపు డెందుఁబోయె దరురా?

శా॥ ఓరా! ఏటికిఁ ద్రుళ్ళిపాటు రిపుశు ♦ ష్కారణ్యనిర్మూలన
స్ఫారోదారదవాగ్నికీలలన మ ♦ ద్బాహాబలవ్యక్త వి
స్తారక్రూరధనుర్విముక్త శరసం ♦ తానంబు ప్రత్యర్థిసం
హారం బిప్పుడ నిర్వహించు భువనై ♦ కానన్యసామాన్యమై.

(శస్త్రాస్త్రములతోఁ బ్రవేశించి యాశ్చర్యముతో ముక్కుపై వ్రేలిడుకొని)

ఏమిది? నన్నుఁ జూచినంతమాత్రమున బెబ్బులిం గన్న లేళ్ళగములరీతి వైరిసేన వెన్నిచ్చి పరుగెత్తుచున్నది. (నవ్వుచు బిగ్గరగ) ఓహో! పాశ్చాత్యతురుష్కక్షత్రియదళంబులారా! ఎట్టి యకార్యంబునకుం గడంగితిరి?

క॥ మగజన్మ మెత్తినారలు
తెగుదుమటంచు వివిధాస్త్ర ♦ ధరులై యీ రీ
తిగ రణభూమిం దొలంగిన
నగరే మిమ్ముం గని పద్మ ♦ నాయక యువతుల్.

(నిదానించి) ఎట్లదలించినను, ఏమని హెచ్చరించినను, ఎంత యెత్తిపొడిచినను నిలుచునట్లు కానిపించుటలేదు. రణపరాఙ్ముఖుల వెన్నాడుట నాయంతటివానికి ధర్మముకాదు. అయినను మరలింపం బ్రయత్నింతును. హే విమత సైనిక వ్రాతములారా! నిలువుండు! నిలువుండు!

ఉ॥ ప్రాణభయంబునం దొలంగి ♦ పాఱెద రేటికి మృత్యు వెప్పుడో
మానదు ప్రాణికోటి కను ♦ మాటయెఱింగి భయంబుడిగ్గి సే
నానివహంబులార! కద ♦ నంబొనరింపుండు, నాదు చాప వి
ద్యానిపుణప్రసక్తి సుఖ ♦ దంబగు స్వర్గతలంబుం జేర్చెడిన్.

లాభములేదుగాని నైరిజన మిట్లు కాందిశీకత నొందుకారణ మూహింపరాకున్నది. సగంబునకుం బైన నష్టమైన పద్మ నాయక సైన్యంబును బరమదుఃస్థితికిం బాల్పడిన మాకోటయుం జూచిన భయకారణమే కానిపింపదు. ఎంతటియల్పావస్థాభేదంబు లున్నను నాత్మగౌరవాధంబై పెనంగు పద్మనాయకదళంబుతోం బొట్టకూటికిం బోరాడు వైరి సైన్యము ప్రతిఘటించుట యసంభవమే. వీరపద్మనాయకు విజృంభణము సామాన్యమా?

సీ॥ ప్రతిస్పర్ధిభ ద్విభ ♦ పంచాననోదగ్ర
శౌర్యోద్ధతులగు రే ♦ చర్లవారు
శాత్రవారణ్య ప్ర ♦ చండదవానల
ప్రతిమానులైన వి ♦ ప్పర్లవారు
వైరిరాట్తిమిర భా ♦ స్వత్తుల్యభీకరా
నూనులయిన కొప్పు ♦ నూళ్ళవారు

ప్రతిపక్షనాళీక ♦ వారణవిక్రమా
భీలురైనట్టి పెం ♦ పాలవారు
తే॥ గీ॥ ప్రబలపక్షపంక్తి మేఘని ♦ ర్దళనవిలయ
కాలపవమానులౌ నిను ♦ గాలవారు
తక్కువెబ్బది రెండు గో ♦ త్రములవారు
విక్రమించిన భువనమం ♦ బెగ్గడిల్లు.

ఎవ రావచ్చునది? (నిరూపించి) సర్వసేనాపతులగు నినుగంటి నర్సారావుగారిచటి కేతెంచుచున్నారు. (ప్రవేశానంతరము) నర్సరాయా! విశేషములేమి?

ఇను—దేవా! విశేషము లేమియున్నవిగాని మన కధిక సైనిక నష్టమె సను నింతలో మాత్ర మపజయభయము లేదు.

రంగా—నర్సయ్యగారూ! మన కింకను జయాపేక్ష యేటికి? జీవితేచ్ఛ యేదులకు?

తే॥ గీ॥ సుతసతీపితృబాంధవ ♦ వితతికూలె
జయమె యాంగాక నిష్ప్రయో ♦ జనమె మనకు
గెలిచి మోడుమూర్ఖుల లీల ♦ నిలుచుకన్నఁ
బ్రాణములపైని నిస్పృహా ♦ మానితంబు.

ఇను—దేవరవారి యభిప్రాయము కాదననుగాని యీ నిష్కారణ కదనకారణుండును, బద్మనాయకద్వేషియు నైన విజయరాముని సాధింపనిదే మనకు మనశ్శాంతి యుండదుగాన—

ఉ॥ చాపునకుం దెగించి పటు ♦ సాహసవృత్తిని విక్రమించి రా
మావనినాథుఁ ద్రుంచి యువ♦నాథము హైదరునోంచి యొక్కటన్
జీవములం ద్యజించి దివిఁ ♦ జేరఁగవచ్చు జగత్త్రమైక సం
భావితసత్యశంబున స్వ ♦ వంశజులెంతయు ముందు గర్వెలన్.

రంగా—ఔను. తమయూహ చక్కనిదేగాని నాకు సమరోత్సాహము నశించినది. మన కెట్లైనను జయము దుర్లభము. వృథాగ ఫరంగిఫిరంగీలకుంచు వాడిపోవుటకంటెఁ గుత్తుకల నుత్తరించుకొనుట యుత్తమము.

ఇను—స్వామీ! అట్లేల తలంపవలయును?

ఉ॥ ఘోరకృపాణపాణుల న ♦ కుంఠిత వీరవిహారవైరి దు
ర్వారుల దేవదానవ ♦ నిరాకరణోద్ధత వారిరాశిగం
భీరుల రామరాడ్ఢళన ♦ భీషణ సాహసవిక్రమక్రమో
దారులఁ బద్మనాయకులఁ ♦ దాఁకు మగంటిమి యేరికబ్బెడిన్?

రంగా—నీ వచస్స్థితి వాస్తవమేగాని ప్రస్తుతపు స్థితిగతులు మనకననుకూలములైనవి. అయినను రణమే కర్తవ్యము. (నిరూపించి) చూచితిరా! వాహినీపతులచేఁ బురికొల్పఁబడి వైరిసేనాసముద్రము తిరుగ మనకోటపై కుప్పొంగుచున్నయది. అదిగో! వెనుదివియక మనవారు మార్కొనుచున్నారు. బళిరా!

తే॥ గీ॥ ఆరితేఱిన పౌరుషో ♦ దారులగుటఁ
బద్మనాయక కులసము ♦ ద్భవులు గనుక
మడమతిరుగు టెఱుంగని ♦ మగతనంబుఁ
జాటుచున్నారు మనవారు ♦ సంగరమున.

ఇను—దేవా! స్వకులీనుల గౌరవము యథావిధిఁ గాపాడు తమ సమదర్శిత్వమే దీనికిఁ బ్రబలకారణము.

రంగా—(చూచి) ఎవ రాయువతీశిరోభూషణము? నేత్రోత్సవమైన యాపెవిజృంభణ మసామాన్యము. రౌద్రరసావతార మనఁజాలు నాపెమూర్తి దర్శనీయమై యొప్పుచున్నయది. వహ్వారే! (నిర్దేశించును.)

మ॥ శరసంధానరయంబు మీఱఁగ జగ ♦ త్సంక్షోభ సంధానరౌ
ద్రరసోదంచితమూర్తినాఁ జెలఁగి వీ ♦ రస్వైరవిక్రీడనా
పరభావంబున వీరబొబ్బిలి పురీ ♦ ప్రాగ్భాగసంరక్షణా
భరముంబూని విదేశవాహినుల ద ♦ ర్పంబార్పు వీక్షింపుమా.

నర్సరాయా! ఆరామామణి యెవ్వతెయై యుండునో?

ఇను—(పోల్చిచూచి) దేవా! గుర్తింపఁజాల కున్నారు గాని యీరా మామణి మల్లమారాణ్ణి పరిచారికాగణములోని రామామణీ నామాంకిత కాదా?

రంగా—(నిరూపించి) అన్యాయమన్యాయము. ముఖాముఖి నీ మహి ళాలలామ నెదిరి నిలువలేక పలువు రొక్కుమ్మడి పైఁబడు చున్నారు. ఓహో! క్షత్రియ పాశ్చాత్య సువనచమూపతు లారా! నిల్వుఁడు నిల్వుఁడు! (ఎలుఁగెత్తి)

మ॥ అరరే! మీవిపరీతచర్యల కవ ♦ శ్య ప్రాప్త మైఁట్టి దు
ర్మరణావస్థ ననుగ్రహించెద మదో ♦ న్మాదంబు భంజించి సం
గరధర్మంబుల విక్రమించు రిపుదో ♦ ర్గర్వంబుఁదూలించి భూ
భరముం మాన్పుతి రంగరాయనిశిత ♦ ప్రాశస్త్యతీవ్రాస్త్రముల్.

(అని శరప్రయోగము నటించుచు వడివడిగా నిష్క్రమించు చున్నాఁడు.)

ఇను—సాధుజన సంరక్షణాసక్తులగు నిట్టి రాజు లుండ దేశముసకుఁ గొఱఁతలుండునా? (నిర్దేశించి చూచి) అయ్యారే!

తే॥ గీ॥ మెఱవు మెఱసిన లీల స ♦ త్వరిత గతిని
రణతలంబుఁ బ్రవేశించి ♦ రంగరావు
మొలఁగొ దుర్నివారుండయి ♦ మేనుమఱచి
సాధురోషంబు కార్చిచ్చు ♦ సామ్య మనరె.

అదిగో! రామామణి సురక్షితంజేసి రంగరాణ్మణి సంకుల సమరమునకుం గవిసె. ఇంక నేను మాత్రి మిచ్చ టెందులకు? ఇదిగో! బూసిహైదరులతో విజయరామరాజట కే వచ్చుచున్నాఁడు. వీరిపైకుతి కెదఁగాక! (బిగ్గరగ) మ్లేచ్ఛమంత్రిసత్తమా! నిలు నిలు! విజయరామ రాజా! పోకుపోకు! పాశ్చాత్య వాహినీపతీ! తొలఁగకు తొలఁగకు!

శా॥ ఓకోరీ! యిపుడెందుఁ బోఁగలరు మ ♦ ద్వ్యూహంబునం జిక్కి కొ
 న్నారిం కెయ్యదిదిక్కు?లంచములఁ గొ ♦ న్నగ్గొండెము ల్గూసినక్
 బోరుల్గూల్చిన వీరబొబ్బిలి భయం ♦ బుంబొందఁగాఁబోదు స
 ర్వారామోగ్రభుజ ప్రతాపపరి ర ♦ క్షాదక్షదీక్షాకృతిక్.

ఇదెవచ్చితివిరా! (అని నిష్క్రమించుచున్నాఁడు)
(బూసియు హైదరుజంగును ప్రవేశించుచున్నారు)

బూసి—మంత్రిసత్తమా! (ఆశ్చర్యముతో) చూచితివా! ప్రళయ సమయ ప్రచండచండికేశ్వర ప్రతిమానుండగు సర్వారాయుని కోపానలంబు ముందు మనదళంబులు భస్మీభూతంబులై పోవు చున్నవి. విజయరామరాజుమాత్రము వెనుదివియక పోరాడు చున్నాఁడు. చేయిచేయిగలిపి పోరాడవలసి వచ్చినచో భారతీ యులతో మనవాండ్రు ప్రతిఘటించుట దుర్లభము. దూరమున నుండి వివిధాయుధసహాయులమై కయ్య మొనరింపవలసినవార మేకాని సంకుల సమరంబులకు బొత్తుగఁ బనికిరాము. భారతీయులే నేర్పునందు శక్తియందును పరాక్రమమునందును నప్రతిమానులు. అందుఁ బస్మనాయకులు మఱియు శ్రేష్ఠులు.

హైదరు—దేవరవారు సెలవిచ్చినభేదం బున్నమాట వాస్తవము. కాని యింకొక్కగడియచిత్తగింపుఁడు.బొబ్బిలికోట నేలపాలై తీరును. ఒక వెలమవీరుండైన మిగిలిపోకుండఁ బరిమార్పఁబడుదురు.

బూసి—ఏమో! (నిస్పృహతో) మనకు విజయము సుకరమని యూహింపఁజాలకున్నాను. వెల్మలు రణసాధనసామగ్రియం దెంత

వెనుక బడియున్నను మన సైన్యంబెట్లు నురుమూడఁ బడుచున్నదో చూచితివా? ఈఘోర సంగ్రామమునుఁగాంచిన నాకు ధైర్యము చలించుచున్నది. అంతియేగాక తగినంత హేతువులేక నిష్కారణ కలహమున కొడిగట్టి యన్యాయముగ మహావీరులఁ జంపవలసి వచ్చెననికూడ మనము కొంచించుచున్నది. కర్తవ్యమే బోధ పడకున్నది.

(తెరలో)

ఓహో! సర్సరాయా! ఎందుంటివి? నాబురుజునకుఁ బగతుల యొత్తిడి యధికముగనున్నది. నీ వొకసారి యిటురమ్ము. నీసహాయ మత్యవసరము. త్వరపడుము. త్వరపడుము.

ఇను—(నిష్క్రమించుచు) దేవా! ఇదే వచ్చుచున్నాను.

బూసి—రంగారావుగారిచే సర్సారావుగారు రావింపఁబడుటవలన విజయరామరాజుగారికి విశ్రాంతిచేకూరినది. ఇదియు మేలే. ఇదిగో! రాజుగారిటె వచ్చుచున్నారు. (విజయరామరాజుతో) విజయ రామరాజుగారా? విశేషములెవ్వి?

విజ—ఏమికలవు? తమరుకూడఁ జిత్తగించుచునె యున్నారుగదా! ఇంతవఱకు మాత్రము బొబ్బిలి ప్రధానయోధులం దొకఁడైనను బడలేదు. మీఁదుమిక్కిలి మనసైన్యాధిపతు లనేకులు కూలిరి.

బూసి—(తనలో) ఇపుడున్నియు నా తెలివితక్కువవలనఁ బ్రాప్తించిన విరుద్ధములె. ఇప్పుడైన యుద్ధము మాన్పింతునా? ఎట్లు వీరి నిరువుర నొప్పింపఁగలను? కానిమ్ము. అన్నింటికి దైవమే కలఁడు.

(తెఱలోఁ గలకలము.)

(నేథ్యమున) హత శేషప్రత్యర్థి చమూసమూహములారా! ఏల పరుగిడెదరు? నేను మిమ్మన్వేషించుటలేదు. మఱియెవ్వరి నంపురా? వినుఁడు—

బూసి—ఏమి యీకలకలము?

విజ—ప్రావృట్సమయపయోధరనిర్ఘోషగంభీరంబైన యీధ్వని రంగారాయని కంఠస్వరము. అతఁ డేదియో వాకొనుచు నిల్లే యేతెంచుచున్నాఁడు.

రంగా—(ప్రవేశించుచు)

సీ॥ పద్మనాయక బల ♦ ధ్వంసనోద్వృత్తిమైఁ
బడరానిపాట్లను ♦ బడినఘనుఁడు
నిజమనోభీప్సిత ♦ నిర్వహణార్థమై
సర్దారులను మేపఁ ♦ జాలుదాత
ప్రబల సత్యేతర ♦ వాక్ప్రభావంబుమై
పోరుఁగల్పించిన ♦ బుద్ధిశాలి
అనుపమసాహస ♦ వ్యాప్తిమై నాదు రా
జ్యంబేలఁ గోరు మ ♦ హాశయుండు

తే॥ గీ॥ విజయనగరాధి నాథుండు ♦ విజయరామ
రాజ నామాంకితుండగు ♦ రాజకులజుఁ
డాతఁ డెందున్నవాఁడు ర ♦ ణాభిలాష
రంగరాయఁ డావ్యక్తి ద ♦ ర్శనముఁగోరు.

విజ—(నవ్వుచు) రంగరాయా! ఆహవదోహలుండనగు నను వెదకుటకు నీవింత కంఠశోషఁ బడవలయునా? నీయెదుటనే యున్నాను చూడుము.

రంగా—(నవ్వుచు) ఓహో! ఎవరువీరు? విజయనగర సామ్రాజ్యాధికారదుర్విదగ్ధులా! మ్లేచ్ఛపాదాశ్రిత క్షత్రియప్రభువులా! జోహారు! జోహారు! బహుకాలదర్శనము!

ఉ॥ కాతరవృత్తిబూని యధి ♦ కారికి లంచము మేపినట్టి దు
ర్నీతికిఁగూడఁ బాల్పడి పొ ♦ రింబొరి బూసిని నప్రమాణవా

చాతతి మోసగించితని ♦ సంబర మేటికి రంగరాయుని
ఖ్యాత ధనఃపరిభూతవిశి ♦ ఖానలకీంలు సిక్కమించునే?

విజ—రంగరాయా! బొబ్బిలి వెల్మవారి విషయమై మేము సర్వంబు నెఱుంగుదుము. నీ విప్పుడు ప్రత్యేకించి వచింప నవసరము లేదు. తల్లిపుట్టినయింటిప్రశంస మేనమామలయొద్దనా?

ఉ. మాలిమిమాలి క్షుద్రగతి ♦ మాటికిఁజేటికి నేఁటి కిట్లు వా
చాలత వెల్లడింతువు? వి ♦ చారణసేసినఁ దప్పులేని స
చ్ఛీలుఁడు లేఁడు నేఁడు తఱి ♦ చేష్టలు తా నెఱుఁగంగలేక యీ
లీల వచించునీతు లవ ♦ లీల నరుల్, దది నైజమేసుమీ.

పెక్కుమాటలేల? వచ్చినపనిఁ జూచుకొమ్ము. అది యుత్తమ లక్షణము.

రంగా—రామరాజా! కోపగించుకొనకుము. నావచ్చిన పని స్పష్టీకరించెదను వినుము.

శా॥ మహాసాబూసిని హైదరుఁ విజయురా ♦ మఃఖ జండకోదండ వి
ద్యాసర్వస్వముసక్ వధించి విజయో ♦ త్సాహంబుమై వాండ్రిదు
ర్వ్యాసంగంబులకుఁ ఫలఁబు నెఱవే ♦ ర్పఁ వచ్చియున్నాఁడ బా
హాసామర్థ్యమెయున్న నోర్తురు మదీ ♦ యు కూర్రహోపాగ్నులన్.

విజ—రంగారాయా! నీప్రగల్భత్తు లింతతో విరమింపుము.

శా॥ కోటల్దాటెడి మాటలాడెదవు నీ ♦ కుంఠాఁతెలందున్న ప్ర
జ్ఞాటోపం బది చేఁతలం గనము శౌ ♦ హా శౌహిం నాతోడఁ బో
రాటంబాడన నిల్వఁగాఁదగిన శౌ ♦ ర్యంబున్నె యుస్మద్ఘను
ర్జ్యాటంకారమె పద్మనాయుల మన ♦ స్థైర్యంబు భేదింపదే.

రంగ—విజయరామరాజా! మాటకు మాటఁ బ్రత్యుత్తరంబిచ్చుట కాదు. వేటునకు వేటుఁ దీర్చుకొనవలయును. సిద్ధపడుము.

విజ — సెహబాస్! అది పురుషలక్షణము! రారమ్ము. (ఇరువురు యుద్ధమునకుఁ బూనెదరు.)

బూసి — (తనలో) వహ్వారే! రంగారాయుని యస్త్రవిద్యానైపుణ్యమునకు విజయరామరాజు క్రిందుమీఁదగుచున్నాఁడు.

హైదరు — రంగారాయుని పరాక్రమము వినినదానికి మిగిలినది.

రంగా — (లోపలనుండి తుపాకిగుండు రంగారాయునికిఁ దాఁకి నేలకొఱఁగియు రక్తముగారకుండ మూర్ఛిల్లుచు) అన్యాయముగఁ నెవ్వఁడో యితరులతోఁ బోరాడు నన్ను మాటుఁగుననుండి శతఘ్నిబారిం బడనేసె. గాయము దారుణమైనది. ఆయాస మధికమగుచున్నది. (మూర్ఛపోవుచున్నాఁడు.)

విజ — (తనలో) అయ్యయ్యో! తుపాకీచేత నెంత యకార్య మొనర్చిరి! నాతోడఁ బోరాడు మహాయోధు నొక్కని నధర్మముగఁ బడనేసిరి. మాకీ కళంకము తీరనిదికదా! సంగరధర్మాతిక్రమణ మన విదేశవాహినులు బొత్తుగ నెఱుఁగకున్నవి.

(తనలో) ఓహో! వీరబొబ్బిలి పన్నగనాయక శూరాగ్రేసరులారా! ఏలచూచెదరు! రంగరాయప్రాణి నన్యాయమార్గమునఁ బడనేసిన దురాత్ముని బోడు. వుంచుడు. తలపడుఁడు. పోడుపుడు. పోనీయకుఁడు. మ్రిందింపుఁడు. వెంగళరాయా! త్వరపడుము. త్వరపడుము. అన్నగారిని గలిసికొనుము. నేనును వచ్చుచున్నాను.

(తెరలో)

ఏమేమీ! నేను కంఠగతప్రాణుండనై యుండ మదగ్రజు నీడనైనఁ ద్రొక్క మగవాఁడుగలఁడా? (ప్రవేశించుచు)

శా॥ ఏఁడీహైదరు! బూసిగారెచట! రా ♦ జేమయ్యె సన్నాఁకి పో
రాడంజాలిన శూరులున్న నిలుఁడీ ♦ రంగావనీనాథునిc

బాడిందప్పి విరుద్ధయుద్ధమున నొం ♦ పంజూచు మీకెల్ల నూ
టేడుల్ నేఁటికినిండె నావలన మి ♦ మ్మోడాట లాడించెదన్.

(వేఱొకవైపునుండి నరసారావు ప్రవేశించును)

బూసి—(భయభ్రాంతుఁడై) మంత్రిసత్తమా! విజయరామరాజా! భ్రాతృమరణ శ్రవణసంజనిత రోషావేశ వివశుఁడగు వెంగళ రాయని యెదుటఁ బ్రస్తుతము నిలువరాదు. పోవుదము రండు.

(రామరాజు హైదరులతో బూసి నిష్క్రమించును.)

ఇను—అక్కటా! ప్రభువుగారిదే వీరశయన మలంకరించిరి. (సమీపించుచున్నాఁడు)

వెంగ—(అదరిపడి) (అన్నగారి కళేబరముఁగాంచి) హా! పద్మనాయక వంశపయః పారావార రాకాసుధాకరా! హా! జగదేకధను ర్వేద పారసంగ్రహణైకప్రవీణా! హా! తృణీకృత యవనపాశ్చాత్య క్షత్రియచమూనయూహా! హా! అగ్రజా! (మూర్ఛిల్లును)

ఇను—అక్కటా! ఎంతటివిపత్తు సంభవించెను! వెంగళరాయఁ డె ట్లూరడిల్లఁగలఁడు?

వెంగ—(లేచి, మూలదైవమా! నిన్నేమని దూఱువాఁడ? విరబొబ్బిలి పద్మనాయకమహైశ్వర్యసందర్శనమున నీకుఁ గన్నులుకుట్టెనే? అగ్రజా! ముప్పదేడుల ప్రాయమునకే మఃకాకుముసలివై శరీరంబుఁ ద్యజించి వీరస్వర్గ మలంకరించితివా? ఇంకెవరిని జూచు కొని యుద్ధంబొనర్తు? జయించి యేసామ్రాజ్య మధిష్ఠింతు? విజ యరామునిపగఁదీర్చి యెవ్వరి కానందమొనఁగూర్తు? ఛీ! ఛీ! నా కింకను జీవితేచ్ఛ యెందులకు? సోదరా! బాంధుమిత్రకళత్రాదు లగ్ని కాహుతియైనను నీవొక్కరుండవుండినఁ జాలుననిక దా ప్రాణంబులపైఁ దీపిమాని వైరిసేనాసముద్రమీఁదఁ జూచు

చుంటిమి. కట్టా! మా సంకల్పము లెల్ల భగ్నంబు లొనరించి నిర్దయాహృదయుండవై మమ్మెల్లరఁ ద్యజించి స్వారాజ్యరమా పురంధ్రి వసహాయఁ గావించి నాకసౌఖ్యావ్యుత్తమ భోగ భాగ్యలాలసుఁడవై సట్టనడి సముద్రమున మమ్ముల ముంచి తనువుఁ జాలించితివిగదా! మా కు దిక్కెవ్వరు? కర్తవ్య మెయ్యది? బొబ్బిలి గతియేమి? క్షణముల క్రిందనేగదా మన కిప్పు డపజయ భయము లేదని మాకెల్లరకుఁ బ్రోత్సాహ మొనరించితివి. అట్టి నీవె లేకున్నఁ బోరాటమెక్కడ? జయ మెక్కడ? తల్లి, తండ్రి, గురువు, దైవము అనదగు సర్వాధా దరుండవు నీవు లేకున్న వెంగళరాయుని కీశరీరముతో నేమి పనిగలదు? (కత్తిదూయుచున్నాఁడు.)

ఇను—(వారించి) అబ్బాయీ! వీరపురుషోచితమైన కార్యం బిది కాదు సుమా! వెండియు,

చ. విమవక యుత్తముండు దల ♦ పెట్టిన కార్యము దీరుదాఁక పే.
రిడుమలనేని యోర్చు చరి ♦ యింపక పోవుట ధర్మమౌట నీ
వడలక పద్మనాయక మ ౦ హత్త్వము నెల్లడి సేయ ధైర్యముం
జెడి రిపుసైనిక వ్రజము ♦ చిందఱ వందఱ గాఁగఁ బోరుమా.

వెంగ—అయ్యో! ఇంకను సమరమా! విజయమా! రణోత్సాహము నామది కీజన్మమునఁ గలుగునా? వెంగళరాయుని దక్షిణహ స్తమే కూలిపోయినది. అయ్యయ్యో! ఇంక నెక్కడికయ్యా ను? రంగరాణ్మణియే కాదు. బొబ్బిలి రాజ్యమే యాస్తమించినది. వీరపద్మనాయక కులమే నిర్మూలింపఁ బడినది. అగ్రజుని యకాలమరణముఁ గాంచియు వెంగళరాయుని గుండియలు వ్రయ్యలు కావయ్యెఁగా! జీవచ్ఛవమునైన నే నున్నవారిలో లెక్కయేనా? ఎంత ధైర్యముఁ దెచ్చుకొన్నను శోకావేగము మర్భరముగ నున్నది.

రంగా—(కదలుచున్నాఁడు)

వెంగ—నర్సరావుగారూ! ఏమిది? అన్నగారు కదలినట్లయ్యెను. భ్రాంతియా! నిక్కువమా?

ఇను—నాకు నట్లేకానిపించినది. కాని కన్నులు చెదరినట్లు తోఁచుచున్నది.

రంగా—(కనులవిచ్చుచున్నాఁడు.)

వెంగ—అన్నయ్యా!

రంగా—తమ్ముఁడా! (హీనస్వరమున) దాహము.

ఇను—(నీరుకొఱకు పరుగిడు చున్నాఁడు)

వెంగ—అగ్రజా! నా యంకతలంబునఁ దలఁ జేర్చుకొనుఁడు. (అని తొడపైఁ బరుండఁబెట్టుకొనును.

ఇను—(నీరు త్రాగించు చున్నాఁడు.)

రంగా—(గాయముఁ జూపుచు) నర్సరాయా! రక్తస్రావ మాగువిధ మాలోచింపుము.

వెంగ—(పై వలువ రంగారాయునికి బిగించి) అన్నయ్యా! మే మెల్ల బ్రతికి యుండినను దమ రెట్టి దురవస్థకు లోనుగావలసి వచ్చెను! (విచారముతో)

మ॥ అరులే యామురుగాక యీవిధపు టన్యాయంబుఁ గావించి సం
గరధర్మంబు లతిక్రమించెద రె యుక్తంబైన నూహింపనే
ర్వరె? పాపంబును బుణ్యముంగ నెడిపైదైవం బేనియుఁ లేఁడె? కా
తరపుం గృత్యమె సాగెనే? యుగమహత్త్వం బిట్టిదై త్రాగెనే?

రంగా—నర్సారావుగారూ! నన్నుఁ గూర్చుండనిండు. (అని సహాయ మపేక్షించును) (వెంగళరాయ నరసరాయల నానుకొని కూర్చుండి) తమ్ముఁడా! విచారింపకుము.

ఉ॥ తీఱె ఋణానుబంధము వి ♦ ధిం గడువంజన దేరికైన నా
తీరుఁదలంచి దుఃఖితను ♦ తీఱ ధృతిందూలకు, వైరి నీరసం
హారవిహారవిక్రమ స ♦ మన్వితవృత్తిని రావువంశపుఙ్
గౌరవవృద్ధికిన్ బ్రయతి ♦ నంబొనరించుట పాడి తమ్ముఁడా!

వెండియు,

ఉ. కాయము గాయమయ్యె నధిం ♦ కంబుగఁ జావది నిశ్చయంబ యే
దో యయిపోయెఁ జింతిలి స ♦ హోదరునిన్ బ్రతికింప లేవు? ది
వ్యాయుధధారివౌచు వెను ♦ కాడక యుద్ధభరంబుఁ బూని నీ
దాయలు నేను లేనికొఱఁ ♦ తం గనకుండగ నిర్వహింపుమా.

ఇను—వెంగళరాయా! ధైర్యముం దెచ్చుకొని యన్నగారి వాక్య మను సరించుటయే కర్తవ్యము.

వెంగ—వెంగళరాయని కింకను గర్తవ్యము కలదా?

రంగా—తమ్ముఁడా! నిస్పృహం జెందకుము. సంగరమున మరణించిన వారికొఱకు సంతపింపఁదగదు. శస్త్రజీవి కెప్పటికైనను శస్త్రముచేతనే మరణంబు ధ్రువము. వేఁడిబాష్పంబుల నిశ్శోక మాఱదు. తీవ్రాస్త్రములవలననే యీపని నిర్వహింపఁబడును. విక్రమించి నా తమ్ముఁడ పనిసించుకొనుము. నన్నిట్టి దుర్గతికిం ద్రోసినవారిని విజృంభించి పగఁదీర్చుకొమ్ము. ఇఁక నేను మాటలాడ లేకున్నాను. ఆయాస మెక్కువైనది. నన్నంపివేయుము

వెంగ—నర్సరావుగారూ! అన్నగారిని వైద్యశాలకుం గొని పొండు. నేను గర్తవ్య మూహించుకొన్నాను.

తే॥ గీ॥ బ్రతుకొ చావొ జయంబొ ప ♦ రాజయంబొ
స్పష్టపడుదాఁకఁ గవచ మూ ♦ డ్వంగఁజాలఁ
బద్మనాయకదుర్వార ♦ పౌరుషాగ్ని
విమతకాంతారసీమ జృం ♦ భించు నేఁడు.

రంగా—తమ్ముఁ డిప్పుడు యుక్తంబుగుర్తించి పురుషశ్రేష్ఠుఁడై ప్రకాశించుచున్నాఁడు.

ఇను—యువరాజుగారు తలఁచిన దుర్ఘటము లేదుకదా!

వెంగ—లేదు. మద్బాహుబలవిక్రమ క్రమాదుల నాకంతటి దృఢవిశ్వాసమున్నయది. పెక్కుమాటలేల? చెప్పినంత చేయఁగల శూరుండనైన నా మాటలు విశ్వసింపుము. ఇంక భవదాత్మకు శాంతి చేకూరుఁగాక!

రంగ—తమ్ముఁడా! నిశ్చయముగ నాయాత్మకు శాంతి చేకూరినది. నీ వప్రమత్తుఁడవై ప్రవర్తింపుము. (నర్సరాయనితో రంగారాయ నిష్క్రమణము.)

వెంగ—చిత్తము. (అసి రణరంగము నిర్దేశించి) ఓహో పద్మనాయక కులావతంసులారా! రణశ్రాంతులగు నన్నగారిం దలపోసి నిరుత్సాహపడుట తగదు. ప్రత్యర్థివాహినీనాయక పరికల్పితవ్యూహవిభేదనానూనధనుఃకళావిశారదుండును నిజసహోదర దురవస్థాకారణ విరుద్ధరణ నీతిజ్ఞ కంఠవిలుంఠన క్రియాత్వరితాంతఃకరణుండును నగు వెంగళరాయఁడు జీవించియే యున్నాఁడు. వెఱవకుఁడు.

శా॥ వీరుం డెవ్వఁడొ భీరుఁ డెవ్వఁడొ ధను ♦ ర్వేదోక్త యుద్ధక్రియా
వారీణుం డెవఁడో నిమేషమున వి ♦ స్పష్టంబుఁ గావించి చం
డారాతిక్షతజాతమజ్జనమహో ♦ ద్యల్లీల వర్తించి శౌ
ర్యారంభంబున మచ్ఛరాసనము ధ ♦ న్యత్వంబునన్ జేర్చుతన్!

(అని ధనువెక్కిడి టంకార మొనర్చుచు రౌద్రావేశంబున) ఇట్లనుంగాక!

మ॥ శరణార్థిన్ విగతాస్త్రునిన్ సమర వీక్షాభ్రాంతున్ భయభ్రాంతునిన్
దరియంబోవక ధర్మసంగర కళా ♦ దర్పోద్ధతప్రక్రియా
భరితంబై నిశితాసికృత్యమొనరిం ♦ పన్ రావువంశీయ దు
ర్ధరరోషాగ్నులు నిర్దహించి రిపుకాం ♦ తారంబు శాంతించుతన్ !

స్వదేశసంరక్షణాసక్తులైన సోదరయోధాగ్రేసరులారా! నేఁడు మనకుఁ బుణ్యదినసంబు.

తే॥ పావసంబగు క్షత్రజ ♦ ఎనము వృత్తి
ఆత్మగౌరవరక్షణ ♦ మాశయంబు
గోవధాది మహాపాత ♦ కుండు వైరి
తరుణమే యిది మనబాహు ♦ దర్పములకు.

నా కిప్పుడు రణస్థలావాసమే యోగ్యంబు.

(నిష్క్రమించుచున్నాఁడు)

(చినరంగారావు, వేంకటలక్ష్మి దిక్కులఁజూచుచుఁ బ్రవేశింతురు.)

వేంక—

సీ॥ రావురంగారాయ ♦ భూవరమల్లాంబి
కాగర్భశుక్తి ము ♦ క్తాఫలంబు
మాతృదేశానురా ♦ గాతిశయము నుగ్గుఁ
బాలతో నేర్చిన ♦ బాలకుండు
సప్తసాగర పరి ♦ వ్యాప్త సామ్రాజ్య మే
లం దగు లక్షణ ♦ లక్షితుండు
దారుణవైరవి ♦ దారణప్రక్రియం
దండ్రిఋణముదీర్చు ♦ ధైర్యమూర్తి

తే॥ గీ॥ నేఁడు తలఁదాచుకొననైన ♦ నెలవు లేక
విధిబలంబున నట్టాడు ♦ వివిధగతుల
నీ కుమారునిఁ బ్రోవను ♦ హింపరయ్య
దయను మీరైనఁ బంచ భూ ♦ తమ్ములార!

అయ్యో! కర్తవ్యమేమి? ఎవ్వని సాహాయ్యము నందెద? ఏమని ప్రార్థించెద? ఎట్లు వీనిని రక్షించెద? బ్రహ్మవ్రాఁత యెంతకైనఁ జాలును. కడకు యువరాజుగారు కూడ వ్రణబాధితులై వీరశయన మలంకరించిరనికదా వింటిని. అక్కటా! మల్లమారాజ్ఞియాన నేపరికారంబున నిర్వర్తించెద? చినరంగారాయని సంరక్షణభార మెట్లు తప్పించుకొనఁగలను? ఆహా! బొబ్బిలికోట సంపూర్ణముగ శాత్రవాధీనమైయున్నది. ఎక్కడఁజూచినను విదేశీయులే. అరుగో! ఎవ్వరో మువ్వురుపురుషులిటులే వచ్చుచున్నారు. (పరికించి) బూసిదొరగారుకూడ నున్నటులున్నది. ఇపుడు భయపడి యేమిచేయఁగలను? దైవమే కలఁడు. (బూసిని సమీపించి) దేవా! నమస్కరించెదను.

శా॥-వీరస్వర్గ మలంకరించిరి రణో ♦ ద్వృత్తిన్ విజృంభించి దో
స్సారుల్ వెల్మలు శీలభంగ భయ వి ♦ స్త్రస్తంబుగన్ స్త్రీలు దు
ర్వారాగ్నిచ్ఛట మ్రగ్గినారు తుదకీ ♦ రాకూన యొక్కండు రం
గారాయాధిపు వంశపుంగతికి మా ♦ ర్గంబౌచు జీవించెడిన్.

తే॥ గీ॥ తల్లిదండ్రికిఁ దప్పిన ♦ తనయు నితని
విమతులేని రక్షణమిచ్చి ♦ పెనుతురనుచు
నమ్మి తమకొప్పఁజెప్పుచు ♦ న్నాను వీనిఁ
జిత్తమగురీతి నేమిచే ♦ సినను సరియె.

వేంక—(చినరంగారావును బూసి కప్పగించును. బూసి కరుణార్ద్రుఁడై చేకొనును.)

హైదరు—(అసూయతో) రావువంశమున నింకను నొకనిసువు శేషించియే యున్నదా? తదవశిష్టమును మత్కరాసి నిర్వహించుఁగాక! దేవా! శత్రుశేష ముండఁగూడదు.

బూసి—(కోపముతో) చాలు నీ హితోపదేశము. ఇంకను నీపాపంబునకుఁ బరిమితియే లేదా? జాగ్రత్త! నీవు నా చెంత నెక్కుడు చనవుఁ గైకొనుచున్నావు. ఇదివఱకు నీ వొనరించిన యోఘమునకు నివృత్తిమార్గ మాలోచింపుము.

విజ—మంత్రివర్యా! ఈముక్కుపచ్చలారని కుఱ్ఱవానిపైఁ బగఁబాటించుటకంటె మౌర్ఖ్యమున్నదా? చినరంగారావు రక్షణ మవశ్య కర్తవ్యము. శరత్కాలపూర్ణిమా విధుబింబ నిరసన హేతుభూతమైన తత్కుమారుని ముఖచంద్రిక దర్శనానంతరము ఎట్టి పాషాణహృదయునకైనఁ గరుణారస ముద్భవింపదా? (తనలో) కట్టా! నావలనఁ గలిగిన యీ కుఱ్ఱవానియొక్క హేయస్థితి గాంచుటకు నాకు లజ్జయగుచున్నది. శత్రుత్వమేమైనఁ జేయింపఁగలదు. మిగిలిన దానికై వగవఁదగదు. "గతస్య శోచనా నాస్తి" అని యాఱడిల్లెదను.

బూసి—(చినరంగారావును రాఁదీసి) నాయనా! నీవు నాదగ్గఱ నుండుము రమ్ము. భయపడకుము.

చిన—నాకేమి భయము?

విజ—పూవు పుట్టినతోడనే తావిఁగొలుపు. (ముద్దుఁగొనుచున్నాఁడు.

బూసి—నిరర్థకంబుగ హైదరుమాటలువిని యెట్టి వీరులఁ గోల్పోయితిని! కానిండు. దాదీ! నీవు సంశయింపకుము. నే నీ కుఱ్ఱవాని రక్షించి యూర్ధ్వసింహాసనాసీనుం గావించెదను.

వేంక—దేవా! కృతార్థురాలనైతిని. రంగారాయ మల్లమాంబల సద్గతులకుఁ గారణముఁ గల్పించితిరి. కుఱ్ఱా! ఒక్క ముద్దిమ్ము. నీకెడ మగుచున్నాను. చిరాయుష్మంతుండవుకమ్ము. ఇదియే కడసారి చూపు. దేవా! నాకిఁక సెలవిండు.

బూసి—నీవెక్కడ కేగెదవు? నీ కలవడినదుఃఖావానితో నుడకున్న నెట్లు? మాతోడ నీవుకూడ రమ్ము.

వేంక—దేవా! అట్లుగాదు. ఇట్లగుఁగాక!

తే॥ గీ॥ తల్లిదండ్రి దైవంబైన ♦ మల్లమాంబ
జరిగిపోయె నా కీతుచ్ఛ ♦ జన్మమేల?
కంఠమును దుస్సించుకొనెద నా ♦ కముననేని
మల్లమారాజ్ఞి సాన్నిధ్య ♦ మహిమఁగనెద.

(అని పొడుచుకొని ప్రాణము విడుచుచున్నది.)

బూసి—(ముక్కుపై వ్రేలుంచి) హైందవుల సాహసము లోకాతీతము.

చిన—అయ్యయ్యో! దాదీ! దొరగారూ! దాది పలుకదేమి?

బూసి—నాయనా! నేను దాదిని బిలిపించెదను. నీవు కోరినవెల్ల నిచ్చెదను. నాతోడ రాఁగలవా?

చిన—ఆడుకొనుటకుఁ గత్తులుఁ గటారులు నుండునా?

బూసి—(చెక్కిలి నిమురుచు) నాయనా! సర్వమును దొఱకును.

చిన— అట్లైన వచ్చెదను.

విజ—సెహబాస్! పులిపిల్ల యనిపించితివి.

బూసి—విజయరామరాజా! అస్తమయమైనది. బొబ్బిలికోట స్వాధీనమైనది. రేపు విశేషములఁ జూడఁదగును. ఇప్పటికిఁ బటకుటీరముఁ జేరుదము రమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము





శ్రీమత్పరదేవతాయై నమః

# బొబ్బిలి



(పద్మనాయకవిజయము)

## పంచమాంకము

(రంగము-రాజాముకోట, పర్యంకశాయియై పాపారాయఁడు ప్రవేశించును.)

పాపా—(నిట్టూర్పుపుచ్చి) ఇది యేమివిచిత్రము! ప్రయత్నపూర్వకముగఁ గనులుమూసినను మూఁతపడకున్నయవి. మనంబు పరిపరివిధంబులఁగీడును శంకించుచున్నది. అనుమానగ్రస్తుండౌటచేఁ గాఁబోలు ప్రపంచమవశకునమయమై కానిపించు. కారణ మూహింపఁజాలకున్నాను.

క॥ వేఁకువజామైన మనో
వ్యాకులమున నేఁడు కున్కు ♦ పట్టదు నాకున్
మాకపకారం బేదిరొ
హైకొనినవిధానఁదోఁచు ♦ స్వాంతంబునకున్.

బొబ్బిలి క్షేమసమాచారము నేఁడేకదా రాసిది! నేనింత కలవరపడనేల?

నేపథ్యమున—పాపరాయా! పాపరాయా! ఎందుంటి వెందుంటివి?

పాపా—ఎవరురా! (ఆత్మగతము) శత్రువు కాదుగదా? (అని వాలుఁ బెఱికి లేచి యోచించుచున్నాడు).

దేవా! సర్వనాశనమైనను దొందరింపకున్నావా?

పాపా—(తనలో) స్వజనకంఠరవంబే. (బిగ్గరగ) ఏమోయి అపిృయము లాడుచున్నావు! ఏమిమునిఁగినది?

(త్వరగాఁ బెద్దన్న, వెంకన్నలు ప్రవేశింతురు)

స్వామీ! రక్షింపుము. రక్షింపుము. (అని పాదములపై వ్రాలుదురు.)

పాపా—(విభ్రాంతుఁడై) పెద్దన్న వెంకన్నలారా! నా శరణ్య మపేక్షించుచున్నారేమి?

పెద్ద—అయ్యా! మాకింకొక శరణ్యస్థాన మెయ్యది?

వెంక—అయ్యా! మీరుదక్క మాకు వేఱు దిక్కెవ్వరున్నారు?

పాపా—అయ్యో! అట్లనుచున్నారేమి? మీరాక యెక్కడనుండి?

పెద్ద—మాదౌర్భాగ్యదేవత చెంతనుండి.

వెంక—ఎక్కడనుండి రాఁగలము? వీరబొబ్బిలినుండియే.

పాపా—అట్లయినచో బావగారులేరా? వెంగళరాయఁడులేఁడా?

పెద్ద—ఉన్నారు. లేకేమి?

వెంక—వీరస్వర్గమందునో? కొనయూపిరితోడనో?

పాపా—(ఆశ్చర్య భయానక దుఃఖరసంబులతో ఖడ్గంబు విడిచి నేల కొఱఁగి) హా! భారతీయనైసర్గిక స్వాతంత్ర్యసంరక్షణాసక్తహృదయా! హా! తృణీకృతగాండీవిధనుర్విద్యారహస్య సంగ్రి

హా శైకప్రవీణా! హా! రేచర్లగోత్రప్రయః పారావార రాకానిశా
కరా! హతోస్మి! హా హతోస్మి! (అని మూర్ఛిల్లును)

పెద్ద—దేవా! ఊరడిల్లుడు మూరడిల్లుడు.

వెంక—అయ్యో! ఇది వీరోచిత కార్యంబుగాదు.

పాపా—(లేచి) ఆహా! ఇంకేమని జీవించెదను? (నిర్వేదముతో)

శా॥ రంగారాయ నృపాలకా! ప్రబలధై ♦ ర్యస్థైర్య మంథాద్రి! ఉ
తుంగాభీలపరాక్రమక్రమకళా! ♦ దుర్వారశస్త్రప్రభా
గాంగేయా! పవనాత్మజాత సదృశ ♦ ఖ్యాతైకదుర్ధర్షదో
స్సంగా! ఎందరమున్నఁ గర్మఫలమే ♦ సాగెంగదా నీయెడన్.

వెంగళరాయా! దగ్గఱనుండియు సోదరుని గోల్పోయితివి
గదా! అయ్యో! నా వట్టియేగాని నీశక్తి వంచన ముంచుకొని యుండునా?
విధినిర్ణీతమ ప్రతిహతముగదా?

సీ॥ క్షత్రియ యవనపా ♦ శ్చాత్య వాహినులకు
దుర్గమంబగు మన ♦ దుర్గమందు
వెంగళరాయాది ♦ వెల్మవీరోద్ధతుల్
చేరి నిన్నుఁ బరివే ♦ ష్టించియుండ
సమరశూరవ్రాత ♦ సంస్తుత్యదోర్బల
శాలివౌ నీచేత ♦ శస్త్రమలర
వీరబొబ్బిలి నాల్గు ♦ వేలదళంబును
బ్రభుభక్తియు క్తిమైఁ ♦ బరిఢవింప

తే॥ గీ॥ ఒక్క మానవమాత్రు ♦ లెక్కయేమి
నిర్జరులకేనియుఁ నీవు ♦ దుర్జయుఁడవె
ఎట్టిదురవస్థ ప్రాప్తించె ♦ నట్టినీకు
బ్రథనగాంగేయ! శ్రీరావు ♦ రంగరాయ!

## పంచమాంకము

అమిత రోషావేశంబున నోడలెఱుంగని బాహుదర్ప ప్రతాప ప్రదర్శనమునకుఁ బాల్పడి మావారిట్టి దుర్గతికి లోనై యుందురు. లేకున్న నొక్క-పూటలో యుద్ధము పరిసమాప్తి కాఁబోదు.

పెద్ద—ప్రభువుగారు లెస్సగా యోజించిరి.

వెంక—దేవా! నిన్నటి ప్రభాతము మొదలు మధ్యాహ్నమువఱకు కోట చలింపలేదు. పిమ్మట శతఘ్నికాహతి నచ్చటచ్చట శిథిల మయ్యెను. అటుపైనఁ గోపాతిరేకంబునఁ గోటవదలి రిపుసైన్యంబులఁ జొరఁబాఱి వీరవిహార మాచరించి మనవారు వీరస్వర్గ మలంకరించిరి. తాము రాజాముకోటఁ గాచుచున్నారని విని విజయరామరాజు శత్రుసైన్యంబును దేవులపల్లి మార్గంబునఁ దీసికొనివచ్చి నిన్నటి యుదయముననే మన కోట ముట్టడించెను.

పాపా—అదియే మనవారుచేసిన ప్రమాదము. ఈ రాత్రిఁటఱకుఁ గోట విడువక కాపాడుకొనియున్న నెల్లుండ నే నీవార్తఁగనిపెట్టి యుందును. ఎల్లిప్రభాతంబున నేనును మనవారును వైరిసైన్యంబులను బురోపరిభాగంబుల నెదిర్చియుండినఁ జేయునదిలేక ప్రతిపక్షులు మనకుఁ బాదాక్రాంతులై యుందురు. జయము కరతలామలకమయ్యెడిది. వేగిరపాటున సర్వము తలక్రిందైనది. గతజలసేతుబంధనమున నేమిప్రయోజనము? విధివ్రాత ననుసరించి బొబ్బిలికోటకును, మాకును నేఁటితో ఋణము పూర్తిగాఁ జెల్లినది. దీనినిగుఱించి ధీరోదాత్తుఁడు వగలఁ బొగులఁదగదు. శోకాతిరేకంబున నడుగమఱచితిని. మల్లమాంబ యుదంతమేమి? తక్కుంగల స్త్రీలగతియేమి?

పెద్ద—వెంకన్నా! కర్ణకఠోరంబగు తత్కథావిధానము నీవే వివరింపుము.

వెంక—అట్లు కోట శిథిలంబగుచుండ—

పాపా—(మాట కడ్డమువచ్చి) వెంకన్నా! ఏదియెట్లయిన, బోనిమ్ము. మానభంగభయంబు లేదుగదా!

వెంక—లేదు. లేదు.

పాపా—చాలును. ఇఁక నేమివచించినను నప్రియముగ భావింపను. కానిమ్ము.

వెంక—ప్రభువుగారు పరాభవభీతిచేఁ జెలికాని వెంకయ్యగారిని శిశుస్త్రీవధాకార్యనిర్వహణార్థమై యేర్పఱచిరి.

పెద్ద—చెలికాని వెంకయ్యగారి యాగమనంబుననే యుద్దేశ మూహించి మల్లమారాజ్ఞి తన కైజారున కెఱయయ్యె.

పాపా—సెహబాస్ వీరపత్ని! దిగంత విశ్రాంతకీర్తి నార్జించితివి.

వెంక—తదితర శిశుస్త్రీబృందమును నగ్నికాహుతిఁ గావింపఁబడియె.

పెద్ద—తదనంతరము పద్మనాయక యోధాగ్రేసరులెల్లరు. సంకుల సమరంబునకుఁ గవిసిరి.

పాపా—రంగరాయా! ఇదియెల్ల నీచేత సంభవించినగతిసుమా!

శా॥ నేనేయుండిన నస్మదీయరణ పాం ♦ డిత్యప్రభానూన బా
హానిర్ఘాతపరాక్రము ప్రథితదా ♦ వాగ్నిచ్ఛటల్ రామరా
ట్సేనానాయకులన్ దహింపఁ బరదే ♦ శీయోగ్ర సంగ్రామ వి
ద్యానైపుణ్య మతిక్రమించియు స్వసం ♦ స్థానంబు రక్షింపనే!

వృథాభ్రాంతికాని లేరా? ఉపయోగపడిన వారి బాహుమేధా బలంబులు చాలకపోవునా? కాలగతి తప్పివచ్చునప్పుడు మానవవ్యక్తి శక్తిసామర్థ్యంబు లక్కఱకురావు. నేను లేకపోయితినే యని పరితపించుటేగాని యున్నచో నున్నవారేమిచేసిరో నేనును నదియే యొనర్చి

యుంపను. దైవయత్నమున కెవరు ప్రతిఘటింపఁగలరు? వెంకన్న పెద్దన్నలారా! వీరబొబ్బిలికోటలోని పద్మనాయకకుటుంబములు నిరవశేషముగ నశించినట్లేనా?

పెద్ద—బాబూ! అందులకు సందేహమా!

వెంక—వెంగళరావుగారొకరు మాత్రము కొంయాపితో బూసిగారి ప్రాణవైద్యశాలయందున్నారు. తుదకుఁ జిన రంగారావుగారు సహితము—

పాపా—ఆఁ విపరీతమేమియుం జెప్పవుగదా!

వెంక—చెప్పను. శత్రువులకుఁ జిక్కరిగాని బూసిగారు రక్షింపఁబడుచుని వాగ్దానమొనర్చిరి.

పాపా—పోనిమ్ము. ఇది యొకకీడులోని మేలు. ప్రభుకుటుంబమునకు నివాపాంజలి యొసంగుట కీమాలకమైన సిలిచె చిరాయువ్మంతుండగుఁగాక! వెంకన్న పెద్దన్నలారా! సరిపోయినది. చరిత్రము సాంగముగా వింటిని. ఈయందరినవారి కన్ని తిలోదకము లిచ్చెదను. ఇఁకఁ గర్తవ్య మేమియో బోధింపుఁడు.

పెద్ద—స్వామీ! తమ కేము కర్తవ్యము బోధింపఁగలవారమా?

వెంక—చేయఁగఁ బయుంతవఱకు శత్రుమారణకర్మంబున వర్తిల్లి ప్రభుఋణముక్తులమగుటయే సమంజసము.

పాప—వెంకన్నా! ఎవ్వరి కొఱకి కను యుద్ధముఁ గావించెద?

ఉ॥ బంధుగు లాప్తులుఁ హితులు ♦ ప్రాణములఁ విడనాడి స్వర్గముం
బొందిరి మోడుమాత్రఁకువలెఁ♦బొక్కెదనొక్కఁడ నేమి చూచి చే
యుందగుఁ బోరు శాత్రవబ ♦ లాధిక మెన్న జయాభిలాష లే
దెందుల కీప్రయాన త్యజి ♦ యింతు స్వఖడ్గముతోడ జీవముల్

పెద్ద—ఇది శూరధర్మము కాదు.
వెంక—అయినను దమరే యోజింపుఁడు.
పాప—అయ్యో! యోజించుట కింకేమున్నది!

ఉ॥ అట్టి త్రిలోక వందిత మ ♦ హామహిమాన్వితశీలమైన తోఁ
బుట్టువు మల్లమాంబ యసు ♦ వుల్ త్యజియించె మురారికైన ని
ట్టట్టన రాని నిశ్చలబ ♦ లాతిశయుండగు రంగరావుచే
పట్టిన భార్యనుం గలిసెఁ ♦ బాపయపాపము పండఁబాఱెనాఁ.

వెండియు బొబ్బిలి దుఃస్థితిఁ దలంచి యూఱడిల్లలేకున్నాను.

మ॥ ఎవఁ డర్జించెనో యెన్నఁ డేర్పడియెనో ♦ యీరాజ్యమేలాటి వై
భవముల్ గాంచెనో పద్మనాయకుల దౌ ♦ ర్భాగ్యంబుచే నేఁటితో
యావనాధీనములన్ మొలంగి గతి స ♦ ర్వాధిక్యమై పొల్పుఁద
క్కె విధిప్రాప్తిని మీఱఁజాలక యశ ♦ క్తిన్ శోకము లీక్షింపఁగన్.

ఏమో? సర్వనాశమైన తదుపరి విక్రమమువలనఁ బ్రయోజనములేదు. ఆత్మహత్యామార్గమునన్నైన రంగారాయాదులఁ గలిసికొన యత్నించుటయే సమంజసము.

పెద్ద—ప్రభువులు తప్పఁ దలంచుచున్నారు.
వెంక—మనవిచేయఁగలవాఁడను కాముగాని దూర మాలో
చింపుఁడు.

పాపా—ఔను. ఆత్మహత్య మహాపాతకము. రణరంగమరణమే ముక్తిప్రదము. కనుక సమరతలంబే ప్రవేశయోగ్యంబు. ఇంక యుక్తాలోచనతోఁ బనిలేదు. ఇంతకంటెఁ గీడు మూడఁదగినది యులేదు. (కొంచెమూఁగి) వెంకన్నా! సరే. బాగుగనున్నది. మనవారందఱి సంగతిఁ జెప్పితివి. ఎదిరి బలంబుల స్థితిగతులు పలుకవైతివి.

పెద్ద—ఏ కొద్దిమందియో మిగిలిరిగాని సైనికనష్టము వారికే యధికము.

వెంక—సైన్యంబు లెట్లుపోయినను విజయరామాదులు మాత్రము సురక్షితముగ నున్నారు.

పాపా—తాండ్రపాపరాణ్మృగేంద్రము జీవించియుండ విజయరామునకు సురక్షితమా? ఎన్నాళ్ళు? నేఁటి కాయుఃపూర్తియై తీఱవలయును.

శా॥ పాపంబో మఱి పుణ్యమో సలిపెఁ దా ♦ నారాయఁడన్ బేసు సం
స్థాపింతున్ జగముల్ విశుద్ధరణధ ♦ ర్మజ్ఞుండనం చేక మ
త్కోపంబాఱదు రామరాజ మరణో ♦ ద్యోగంబునే తుచ్ఛమా
యోపాయంబున నేసెఁ దీర్చు దనుకన్ ♦ యుద్ధంబులోఁ దప్పినన్.

పెద్ద—దుర్మార్గుని సాధించుటకు దుర్మార్గగామియైనను దప్పులేదందురు.

వెంక—తప్పైనను నేఁడు సుఖ మనుభవించుచున్నామా, రేపు నరకప్రాప్తి సంశయించుటకు!

పాపా—కనుకనే బొబ్బిలికింత దుర్గతిఁ గల్పించిన కట్టిఁడి నేమిచేసినను ఎట్లు సాధించినను దప్పుగాదని నమ్మితిని. వీరబొబ్బిలి వేణుగోపాలస్వామి మనపాలఁ గలఁడు. అట్టి శుభశకునములు నాకుఁ బొడఁగట్టుచున్నవి. మనము సఫలీకృత మనోరథులమై ప్రభుఋణముక్తుల మయ్యెదము. దిగంత విశ్రాంత యశోవిరాజితులము కాఁగలము. మీరు ధైర్య మవలంబింపుఁడు. నాబారిఁబడి తప్పకొనఁగలవాఁడు లేఁడు. నిశ్చయము.

శా॥ ధర్మాధర్మవివేచనాగరిమఁ జి ♦ త్తంబందుఁ బోనాడి దు
ష్కర్మారంభుని రామభూవరువధా ♦ కార్యంబు నెగ్గించి యా
దుర్మార్గంబునకున్ ఫలం బనుభవిం ♦ తున్ గాక యారాతితో
నిర్మానుష్యవిరోధిలోకమున శాం ♦ తించున్ మదస్త్రంబులున్.

పదపడి పాపారాయుని హృదయము శాంతి చేకూరుఁగాక! వెంకన్న పెద్దన్నలారా! తెల్లవాఱినది. ఈరాత్రి పర్వంబును మత్కరవాలం బువలననే చక్కఁబడును. మీ రిరువురుమాత్రము తత్క్షణము పగల కంటఁబడకుండ బొబ్బిలింజేరి మాఱువేషభాషలతో నాయాస్థలములఁ జూచి విజయరామరాజు పటకుటీరముకడకుఁ గటికిచీఁకటియందైన ధారాళముగఁబోనైన మూర్గ మాలోచించి యీరాత్రి రెండవజామున బొబ్బిలిప్రాంతమున నన్నుఁ గలిసికొనుఁడు. మసలవలదు.

వెంక—చిత్తము. (నిష్క్రమించును)

పెద్ద—ఆజ్ఞఁ గైకొందుము. (నిష్క్రమించును)

పాపా—పూజ్యమైనకరవాలమా! నేఁటిరాత్రి నీ వప్రతివాతప్రతాపముఁ జూపవలయు సుమా!

సీ॥ ప్రతిఘటించిన పరి ♦ పంథివర్గముఁ గిక్క
రనకుండ వడి నఱు ♦ మాడవలయు
ఎట్టితనుత్రాణ ♦ మేనియుఁ భేదించి
విజయుఁ జిత్రవధఁ గా ♦ వింపవలయు
యవనాధమాధము ♦ హైదరుఁ జంపియుఁ
జంపనియట్లు హిం ♦ సింపవలయు
స్వామియే యనెడి వి ♦ శ్వాసముఁ దిగమ్రిం గి
పాపరాయుని హావిం ♦ పంగవలయు
తే॥ గీ॥ శస్త్రరాజమా! కనుక ని ♦ శ్చలతఁబూని
విమతదారుణ విక్రమా ♦ భీలవహ్ని
నార్చి సద్యశశ్చంద్రికా ♦ వ్యాప్తి నీవ
కూర్పఁగావలె విప్వర్ణ ♦ గోత్రమునకు.

(ఖడ్గమును గనులనద్దుకొనుచు నిష్క్రమించుచున్నాఁడు)

(ఇది పంచమాంకము)





శ్రీమత్పరదేవతాయై నమః



# బొబ్బిలి

(పద్మనాయకవిజయము)

## షష్ఠాంకము

(బొబ్బిలి పురప్రాంతమునఁ బాపారాయుఁడు ప్రవేశించుచు)

పాపా—

ఉ॥ సంతతభోగభాగ్య విల ♦ సత్ప్రతిభా మహనీయసత్కళా
క్రాంతవిరాజితంబయి ప ♦ రాక్రమ సుస్థిరబాహువిక్రమో
ద్ధ్వాంతయశఃప్రభాకలిత ♦ భాసురశూరజనావృతంబునై
కాంతిలు మాతృభూమికడ ♦ గండ్లకు గుండెలు వ్రయ్యలయ్యెడిన్.

అక్కటా! బొబ్బిలిరాజ్యరమాపురంధ్రీ! నిన్నట్టి యిక్కట్టునఁ జూడవలసివచ్చెను! పాపరాయా! పూవులమ్మిన వీధినే కట్టెలమ్ముచున్నావు. సంపదలు క్షణభంగురములనుట ప్రత్యక్షముగ ననుభవమునకు వచ్చెను. శ్రీదేవీ! నీవు చంచలస్వభావ వనుమాట సార్థకపఱచుకొంటివి. కట్టా! ఎట్టు లీదుఃఖసాగరమును దరించెదను?

మ॥ అకటా! మొన్నటిదాఁకఁ గ్రూరరిపు సం ♦ హారంబునన్ బద్మనా
యకసంస్థానముఁ బెంపుసేతునని ధై ♦ ర్యంబందితింగాని నేఁ

టికి నీవిట్లు లనాథనా టులుగ ద్వి ♦ త్సనాసమూహంబు బా
రికి లోనైతివి రాజవైభవ పురం ♦ ధ్రీ! మాకు దూరస్థవై.

ఛీ!ఛీ! ఎక్కడివైభవములు! ఎక్కడిసంసారములు! ఎక్కడిదుఃఖములు! ఇఁక నెట్టి శోకావేగంబేనియు నన్నుఁ జలింపఁ జేయఁగూడదు. నాహృదయము ఱాయిఁగావించుకొని మెద. వచ్చినకార్యం బొక టియుఁ జేయుచున్న కార్యంబొకటియునైనది. రెండవజాము గడచు చున్నది. వెంకన్న పెద్దన్నల జాడలేదు. చాలనిదినములుకనుక నీరు ను శత్రుబాధితులు కారుగదా!

(వడిగ వెంకన్న పెద్దన్నలు ప్రవేశింతురు)

వెంక—
పెద్ద— } స్వామీ! నమస్కరించు చున్నారము.

పాపా—పరిజనులారా! తొందరలేమియు లేవుగదా!

పెద్ద—లేవు.

పాపా—మఱి విజయరాముని యునికిఁ బట్టితెంగితిరా!

వెంక—చిత్తము.

పాపా—మనకార్యంబు నిర్విఘ్నంబగుఁగదా!

పెద్ద—నిస్సందేహముగా.

వెంక—ఇప్పుడు రామరాజుపటకుటీరము నుండియే వచ్చుచున్నారము
ప్రభువులుభటులుమాత్రము గ్రాగుచును గాపాడుచున్నారు.
తదితరులెల్ల రొడలుమఱచి నిదురించుచున్నారు.

పాపా—సెహబాస్! మంచిసమయము. దొంగపోటుతనము తగదని
సంశయింపను.

సీ॥ నిద్రించువారిపై ♦ నిరుపమసాహసం
బులఁ బ్రకటింపఁడె ♦ మునుపు ద్రౌణి
ముందు శిఖండిని ♦ బూని గాంగేయుని
సంహరింపఁగలేడె ♦ సవ్యసాచి
భూరుహంబు వెనుక ♦ పొంచి యా వాలిని
సాధింపఁడే జాన ♦ కీధవుండు
అనృతోక్తులాడి ద్రో ♦ ణాచార్యు నిర్జింపఁ
దలపెట్టఁడే యమ ♦ ధర్మసూతి
తే॥ గీ॥ వాలియు మహాసయు లెందఱో ♦ యాదిరిసల్పి
ఘనతఁజెందిరో వేఱు వా ♦ కొనఁగనేల?
పాపపుణ్యంబు లనియెడు ♦ భ్రాంతివీడి
బహువిధోపాయములఁ బగఁ ♦ బాపవచ్చు.

అయ్యయ్యో! నన్నవతారపురుషులతోఁ బోల్చుకొని యెంత పొరఁబడుచుంటిని? పాషాణంబు నొక్క కోమలాంగిగఁ బరివర్తనముఁ గావింపఁగల్గిన వనజాతాసనవాసవప్రముఖామరమానివాంఛిత సంస్తుత్యాదివ్యపాదరజస్తుల్య ప్రభావంబును నరనారాయణాది పరమపురుషభయంకర హేతుభూత ప్రళయకాలకల్పితానల్పతీవ్ర నారాయణాస్త్ర సముపహారశస్త్రప్రాప్తియు, నిజధర్మపత్న్యభిమానసంరక్షణక్రియాసక్తప్రమత్త పరపంథిప్రాణసంరక్షణాపరప్రతిజ్ఞాపరిపాలనసామ్యధర్మకార్యానురక్తియుఁ దృణీకృతఫాలాక్షాక్షీగ్ర కౌక్షేయప్రతాపానన్య సాధారణోదగ్రక్రోధ విక్రమాభిల నిర్వక్రపరాక్రమక్రమ సదృశమహత్త్వంబును నాకు లభించెనేని నేనప్పుడు శ్రీరామార్జున ధర్మజాశ్వత్థామలతోఁ దులఁదూగఁగలను. మహాత్ముల లీలలలోఁ బ్రమాదంబుల నుదాహరణంబుగఁ గైకొని యవసరమైన తమ దుశ్చేష్టల కన్వయింపఁ జేసికొనఁజూచుట క్షుద్రులపని. వారు దేవతాంశసంభూతులు. ఎందునకైన సమర్థులు. వారిముందు మనమననెంత! హస్తిమశకాంతరము. కనుక నేను ప్రథమమునఁ దలంచిన విధ మను

సరింపక విజయరాముని ధర్మయుద్ధమునఁ దలపడి మగవాఁడ ననిపించుకొనమైదఁగాక!

పెద్ద—అట్లయిన మనము సఫలీకృతమనోరథుల మగుట కష్టము.

వెంక—కష్ట మనియెద వేల? దుర్ఘటమనిన సరిపోవును.

పాప—ఏమనినను సరిపోదు. విజయరాముఁడు నాబారినుండి తప్పించుకొనుట దుర్ఘటమనినప్పుడు సరిపోఁగలదు.

మ॥ హరుఁడుం శ్రీహరియుం సురాసురలు బాహాబాహిమార్గోన్నవే
వురుప్రత్యర్థులు చుట్టుముట్టిన భయం బుంజెందఁగాఁ బోక దు
ర్ధరదోర్వీర్య పటుప్రతాప రిపునం తాన ప్రభాభీలభీ
కరిశౌర్యాగ్నుల నిర్వహింతురు ప్రతిజ్ఞల్ తాండ్రవంశోద్భవుల్.

ఇఁక మాటాడక విజయరాముని పటకుటీరమునకు దారి దీయుఁడు.

(ముప్వురు పరిక్రమింతురు).

(యవనిక యెత్త విజయరాముని పటకుటీరము, ఉత్ఖాత ఖడ్గులగు నిరువురు ద్వారపాలకులు ప్రవేశింతురు.)

పాపా—(దూరమునుండి) వెంకన్న పెద్దన్నలారా! మీరిరువురు ద్వారపాలకుల నిరువురను సడిలేకుండ దవ్వులకుఁ గొనిపోయి వధింపుఁడు. తడయవలదు.

(వెంకన్న పెద్దన్న లిరువురు ద్వారపాలకుల కుత్తుకలనొక్కి యెత్తుకొనిపోవుదురు.)

పాపా—పెద్దన్న వెంకన్నలు వారి నియోజితకార్యంబులు నిర్విఘ్నముగా సాగించుకొనుచున్నారు. ఇఁక నేను మాత్రము మసలనేల? (ఖడ్గమును బరీక్షించి) (మేఘగంభీరస్వరముతో) విజయనగ

రాధిపా! ఫులి! ఫులి! మేల్కొనుము, మేల్కొనుము! (పట కుటీరమును జించి ప్రవేశించి రాజునకుఁ గూర్చుండి.)

సీ॥ హైదరుజంగు పా ♦ దాశ్రయము సేయించి
దురవుఁ గల్పించిన ♦ ద్రోహబుద్ధి
ఉన్నంతలోఁ దృప్తి ♦ నొందక వెలమ రా
జ్యంబేలఁ గోరు దు ♦ రాశయంబు
ఖండాంతరులమైత్రిఁ ♦ గావించి భారతీ
యుల కెగ్గుఁ రోసిన ♦ తులువతనము
పద్మనాయకకుల ♦ ప్రాభవధ్వంసనో
పాయసంకలితమా ♦ పాపవృత్తి

తే॥ గీ॥ యొక్కటై విధిబలము చే ♦ యూఁతనొసఁగఁ
దాండ్రకులుఁడు నిమిత్తమా ♦ త్రంబు గాఁగ
నీవధావిధానంబును ♦ నిర్వహించు
నాత్మసంరక్షణోపాయ ♦ మరసికొనుము.

విజ—(కనులు విచ్చిచూచి చలింపక ధైర్యముతో) ఛీ! ఛీ! విప్రర్ల గోత్రగౌరవాతిశయములకు నీయాచర్య కళంక మాపాదించు చున్నదిసుమా!

తే॥ గీ॥ ఒడలుఁ మఱచి నిద్రించు నా ♦ యురముపైన
నధివసించి ప్రగల్భంబు ♦ లాడెదేల?
పద్మనాయక సత్కులో ♦ ద్భవుఁడ వేని
ప్రతిఘటింపుము ధర్మ సం ♦ గ్రామకేళి.

నిరాయుధుని, నిద్రితుని జంపఁజాలిన మగవాఁడవని నేనింతదనుక నెఱుంగను.

పాపా—విజయరామరాజా! నీయనుమానము నిన్నట్లు పీడించుచున్న దిగాని నిన్నన్యాయంబుగఁ బొరిఁగొనఁ బాల్పడుదునా? దూర

ము నన్నుఁడి కేకలు పెట్టిఁ బాఱిపోయెదవని యిట్లు చేసితిని. ఇఁక నీవు నన్నెట్లును దప్పుకొనిపోఁజాలవు. ఇదిగో వదలితిని. (అని విడుచును) నిద్రితుఁడవేని మేల్కొల్పితిని. నిరాయుధుఁడవేని శస్త్ర మందికొనుము. ఏదీ! ఇఁక నీశక్తిసామర్థ్యంబులు వెల్లడింపుము.

విజ—పాపారాయా! ఇప్పుడు పురుషుండ వనిపించుకొను చున్నాఁడవు.

పాపా—విజయరామా! వైషమ్య వాక్యములతోఁ బనిలేదు. నేను మాటలకెడమీయను! త్వరపడుము. (ఇరువురును ఖడ్గాఖడ్గిఁ బోరాడుదురు. కొంతవడికి నిపుణంబుగఁ బాపారాయఁడుగారు విజయరాముని ఖడ్గమును నెగురఁగొట్టుదరు) రామరాజా! ధర్మయుద్ధఫలితముగూడ స్పష్టపడినదిగదా? (అని రామరాజుపై నధివసించి గంభీరస్వరముతో)

తే॥ గీ॥ విజయరామనామాంకిత ♦ ద్విరద మిపుడు
పాపరాయపంచాస్యంబు ♦ బారిఁబడియెఁ
గావఁగల్గు నీరేడులో ♦ కములవారు
వైళమే తెంచి యితనిఁ గా ♦ పాడుకొనుఁడు.

ఓహో! వీరస్వర్గవాస్తవ్యులగు పద్మనాయకులారా!

మ॥ నరనాథుండును బాంధవాళియునుచుం ♦ డన్ రంగరాట్సత్సభాం
తరమందున్ వచియించియుండిన ప్రతి ♦ జ్ఞల్ తీరలోకైకభీ
కరశస్త్రాస్త్రకళావిశేషభుజ వి ♦ ఖ్యాత ప్రతాపోగ్రని
ర్భరశౌర్యోద్ధతి వైచిత్రివధ ని ♦ ర్వర్తింతు వీక్షింపుఁడీ!

ఓగోరీ! క్షత్రియకులకళంకా! నేఁటికి నీపాపంబులు పండఁబాఱినవి.

ఉ॥ మల్లమదేవియట్టిగుణ ♦ మానిత, మానవతీలలామ, దీ
ప్యల్లలితాత్మ, నీవలన ♦ బ్రాణములం ద్యజియింపనయ్యెగ

రోల్లసనాస్తి బొబ్బిలి మ ♦ హోద్ధతిఁ బాపఁదలంచు పాపముల్
చెల్లెను నేటితో విగత ♦ జీవుఁడవై యిఁక శాంతిఁబొందుమీ.

(అని పొడుచుచున్నాఁడు. విజయరామరాజు పెనఁగులాడును)

ఇంకను బెనఁగులాడెదవా? చింతవిఱిగినను బుఱుసుచచ్చునా?

సీ॥ వీరబొబ్బిలినేలఁ ♦ గోరెద వియ్యది
నీయబ్బసొమ్మా నె ♦ నీచహృదయ!
పద్మనాయక కుటుం ♦ బము లార్పుపాపంబు
కట్టికుడుపకయున్నె ♦ కఠినచిత్త!

(మఱియొకచోట నఱకును)

సర్దారులను మేపి ♦ సంధిపొసఁగ నీని
ద్రోహి మూరకపోదు ♦ దుశ్చరిత్ర!

(వేఱొకచోట నఱకును)

మాకోటగుట్టు వి ♦ మతికెఱింగించినం
దుల కిదే లాభంబు ♦ దుర్మదాంధ!

(నఱకును)

తే॥ గీ॥ నోటికైనట్లు చాడీలు ♦ నూఱిపోసి
బూసి, హైదరుఁ బురిగొల్పి ♦ పోరుఁగూర్చి
విజయనగర సామ్రాజ్యాభి ♦ వృద్ధిఁగోరి
పడినపాట్లకు నియ్యదే ♦ ప్రతిఫలంబు.

(గాఢముగఁ బొడుచుచున్నాఁడు)

విజ—(ఖడ్గము లాగికొనఁ బ్రయత్నించును.)

పాపా—ఆఁ! ఖలమతీ! చావఁబోవుచు మత్ఖడ్గగ్రహణాభిలాషివగుచున్న నీపెంకెతనమునకు నవ్వగుచున్నదిరా! ఇంకేటి జీవితాశ? ఇది గో! కడతేఱితివి. (అని వక్షఃస్థలమున బలముగ గాయపఱచి) ఓహో! విజయరామ చిత్రవధాకథావిధాన సందర్శన కుతూ

హాలోపేత విమానారూఢ గరుడగంధర్వ యక్షకిన్నర కింపురుషాది రంగరాయ ప్రభృతులారా!

మ॥ కసిదీఱ వధియించినాఁడ రిపుర ♦ క్తస్నాత కోద్వృత్తి మా
నస మానందముఁ బొందెఁ బేర్వులను దం♦ డల్ దాల్చి ప్రత్యర్థి దు
ర్వ్యసనారూఢ ఫలంబొసంగి రవిచం♦ ద్రార్క గ్రహస్థాయికీ
ర్తిసమేతంబుగ రంగరాయ ఋణము ♦ ద్రెంగంటి వీక్షింపుఁడీ.

ఇంతటి కోలాహలము జరుగుచున్నను వైరులు మేల్కొనకున్నారేమి? ఓపాశ్చాత్త్య యవనక్షత్రియ దళంబులారా! వీరబొబ్బిలి బెబ్బులి యను నామాంతరముఁగల తాండ్రపాపరాణ్మృగేంద్రంబు సంగ్రామ కాంతార సీమ యథేచ్ఛావిహారము నర్చుచుఁ బ్రత్యర్థిమదకుంభికుంభ వ్రాత విదారణాసక్తదారుణాభీల ప్రతాపసుస్థిరమై విక్రమింపనున్నది. మేల్కొనుఁడు. మేల్కొనుఁడు. త్వరపడుఁడు. త్వరపడుఁడు.

మ॥ తరమానేనియు రామరాజనవర ♦ క్తస్నిగ్ధ కాషాయవి
స్ఫురదుద్వాంతతనుప్రకాశితుఁడనై ♦ చూపట్టు నట్ దాఁకుఁడో
పరిపంథుల్ చవిఁగొండు ప్రాండ్రకుల పా♦పారాయ బాహాభయా
కరశాస్త్రీయరణ ప్రభాకలిత తీ♦క్ష్ణక్రోధ విక్రాంతిఁగన్॥

(తెరలోఁ గలకలము) విరోధులు! విరోధులు!

పాపా—ఆఁ! యవన పాశ్చాత్త్యసైనిక మధుపానమాంద్య మిప్పటికి వదలినది. నిద్రామాంద్యమ్మున యుక్తంబెఱుంగక వారిలో వారు కలహించుచున్నారు గర్జెదఁగాక! (బిగ్గరగా) ఓపద్మనాయక దళంబులారా! నిద్రితుఁడనిగాని నిరాయుధుఁడనిగాని రణపరాఙ్ముఖుఁడనిగాని విడువక పరిమార్పుఁడు. శత్రువినాశనమే మన ముఖ్యోద్దేశము. మనకు ధర్మముతోఁ బనిలేదు.

(తెరలో) అయ్యో! చూచెదరేమి? పద్మనాయక దళముతోఁ బాపారాయుఁడే తెంచి మన సైన్యంబుపైఁ బడినాఁడు. శతఘ్నులఁబ్రయోగింపుఁడు! ప్రయోగింపుఁడు!

(శతఘ్నికా నినదంబులు వినవచ్చును.)

పాపా—సెహబాసు! సుందోపసుందుల చరిత్రము జ్ఞప్తికిఁ దెచ్చునీ యుద్ధము చూడ వేడుకగా నున్నది.

(తెరలో) ఓరీ! దుర్మార్గులారా! ఏలయీలీల విరోధులం జూడక యే యొండొరులం దలపడు చున్నారురా? విరమింపుఁడు. విరమింపుఁడు.

పాపా—అదియే హైదరు కంఠరవము. అతనిపనిఁ గూడఁ జక్కఁజేసిన నా భారము తీఱును. (బిగ్గరగ) హైదరుజంగుమంత్రివర్యా! వైరికోటియిదుఁగదా నీవు వెదకునది? ఇదిగో! బొబ్బిలి బెబ్బులి. విజయరాముని పటకుటీర పరిసరంబుల రిపుకురంగంబుల వేఁటాడుచున్నది. రా రమ్ము!

హైదరు—(ప్రవేశించుచు) ఇదిగో వచ్చితిని. ఛీ! ఛీ! పిఱికి పందా! నిశీధిని గన్నగానివలెఁ బ్రవేశించియా నీకత్తుసాధించు కొనునది! ఇప్పుడెందుఁ బోఁగలవు?

పాపా—కురుషాధమా! ఎందుఁబోఁగలనా? నిన్ను వెంటఁగైకొని వీర స్వర్గ మలంకరించెదను. బొబ్బిలి సింహాసన మధిష్ఠించెద నన్నవాఁడును, అధిష్ఠింపఁ జేసెద నన్నవాఁడును నొక్కని చేతనే గతింపఁబలయు నను ధాతవ్రాఁత శ్లాఘ్యతరంబు.

హైదరు—పాపారాయా! చాలు నీవాచాలత!

పాపా—ఓరోరీ! మ్లేచ్ఛాధమా! వేగిరించుచున్నాను చూడు.

ఉ॥ లంచ మొసంగినంతనె చ ♦ లంబువహించి వృథారణంబుఁ గ
ల్పించిన పాతకంబది ఫ ♦ లించెను నేఁటికి విక్రమక్రమో
దంచిత పాపరాయ బల ♦ దర్పపరాక్రమవహ్ని నిన్ను సా
ధించియె తీఱుఁ గావఁగల ♦ ధీరుఁడు లేఁడు జగత్త్రయంబునన్.

(అని కవయుచున్నాఁడు) (హైదరునకు బలమైన గాయములు తగులును. మూర్ఛిల్లును. పాపారాయఁడు హైదరుజంగుపై నధివసించును.)

పాపా—ఆహా! వీరబొబ్బిలి వేణుగోపాలస్వామి యనుగ్రహమున హైదరుంగూడ సాధింపఁగల్గితిని. విజయరామునిఁ జేయఁదగినంత కార్యముఁజేసి ప్రభుఋణముక్తిం గంటిని. రాజ్యమున కాధారభూతుఁడైన చినరంగారావు జీవించియున్నాఁడు. దైవానుగ్రహమున వెంగళరాయఁడు బ్రతుకఁగలఁడు. పెద్దన్న వెంకన్నలు గూడ వీరవిహార మొనర్చి స్వర్గముఁ జేరియుందురు. బూసిగారు కరుణించిన, విజయము మాయదియే యగు. రంగారాయాదులు లేని బొబ్బిలిఁ జూడఁ జాలను గనుక నిట్లగుంగాక!

తే॥ గీ॥ ఆత్మగౌరవ సంరక్ష ♦ ణార్థ మెట్టి
యుడుము లేనియుఁ బ్రజ భరి ♦ యించుఁగాక!
హైందవులు పరస్పరకల ♦ హముల మఱచి
దేశ ముద్ధరింపఁగఁ బ్రయ ♦ త్నింతురిఁగాక!

(ఇది షష్ఠాంకము.)

(సర్వము సమాప్తం.)



